బృందావన ప్రచురణం 4

# స్వాతంత్ర్య పథం



రచన:

గురుజాడ రాఘవశర్మ

బృందావన ప్రచురణములు

మచిలీపట్టణము.

వెల రు 1—4—0

# మజిలీలు

# ఆశీస్సులు



చిరంజీవులైన మిత్రుడు గురుజాడ రాఘవశర్మ, నాకు చిరకాలమునుండి సన్నిహితమైన ఆప్తకోటిలోనివాడు. నిజమైన ఆస్తికతత్పరతగల భక్తశ్రేణిలోని వాడనుటకు, అతని నిర్దుష్ట నిత్యజీవనమే సాక్ష్యము. స్వయంకృషిలబ్ధమైన సాహిత్యజ్ఞానము, నైసర్గికమైన కమ్మని కవితాధోరణి, అతని కీశ్వరదత్తమైన ఐశ్వర్యములు. మంచిశైలిలో అతనెన్నో పద్యములు, గేయములు వ్రాసి ప్రచురిస్తున్నాడు. ఇతను వ్రాసిన "స్వాతంత్ర్య పథము"లోని కొన్నిఘట్టాలు విని చాల సంతోషించినాను.

ఇతనికి సర్వశుభముల నిచ్చి, చిరకాలము లోకహితకారిగా వర్ధిల్లజేయుగాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

శ్రేయోభిలాషి

చెఱుకువాడ వేంకటనరసింహము.

మకాం : బందరు,
25—1—49.

## కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి యాశీస్సు



ఇది 'స్వాతంత్ర్య పథము' అను పేరితో శ్రీ గురుజాడ రాఘవశర్మగారు గాంధిగారారంభించిన స్వరాజ్యోద్యమములోఁ దానొక యోధుఁడై, కవియై, గాయకుడై, బందితుడై

కడచిన ముప్పదియేండ్ల తన కథతో కలిపి దేశపుకథనుగూర్చి చేసిన రచనల సంపుటి.

ఇందు స్వరాజ్యోద్యమము నాటిబాధలు-స్వరాజ్యసిద్ధి-నేటినాయకుల ప్రశంస - యను - పూర్వోత్తరగాథలు కలవు.

ఇందు పూర్వగ్రంథములోని పాటలు, శర్మగారు పాడుచు వాలంటీర్లను నడిపించినవి. కోర్టులోఁగూడ పాటలతోనే ప్రసంగము.

జైలులోని కథలు - దుష్టాన్నము - దేవతాపులుసు - చీకటిలో రాక్షసమైన లాటీదెబ్బలు.

స్వరాజ్యము సిద్ధించుటకు నెంతమంది యీ ఘోరస్థితి నవలంబించిరో తెలియును.

రాఘవశర్మగారు కవి. ఈనెత్తురుకథలో శృంగారము-భార్యాభర్తల యనురాగము - ఇదియొక చిత్రమైన గ్రంథము.

బందరులో మే మందరము డాక్టరు పట్టాభిగారి శిష్యులము. ఆయన మా నాయకుడు. వారిమీఁది శర్మగారి పద్యాలు ఈ గ్రంథానికి జీవము.

ఈ గ్రంథములో జాతీయజెండాలు ఎన్నిమార్పులు పొందినవో అన్ని ఉన్నవి. గాంధిగారికి ప్రియమైనకీర్తనలున్నవి.

ఈ చిన్నిపుస్తకము - దేశభక్తి - కవితాశక్తి - మనోరక్తి అన్నిటికి ప్రకాశకము.

నేను నాడు వీరందరితో జైలులోకి వెళ్ళకపోయినను నాకు నేనుగూడ వెళ్ళినట్లేయుండును. అబ్బా! కష్టాలు తీరినవి. స్వరాజ్యము వచ్చినది. కాని ఏ పథము వెంట యిచటికి జేరినామో వెనుకకు తిరిగిచూచుటయే శ్రీ 'స్వరాజ్య పథము'

విశ్వనాథ సత్యనారాయణ.

# పరిచయం

ఆంధ్రమహాశయులారా !

ఈ "స్వాతంత్ర్య పథము" కొన్ని, మజిలీలుగా విభజింపబడింది. అసహాయోద్యమ ప్రారంభంనుంచి (1921) స్వాతంత్ర్య స్థాపనవరకు (15-8-1947), మాతృదేశ దాస్య విమోచనకై, భారతవీరులు పడినశ్రమలను, గేయములు, పద్యములు, పాటలు, బొబ్బిలిపాటలు మొదలగు వృత్తములలో జానపదులకుఁగూడఁ దెలియనగు సులభభాషలో వ్రాయబడెను. ఇవి యాయా యుద్యమములలో, వీరావేశముతో, భారతీయ కర్తవ్యము నుద్బోధించుచు, పురోగమించుటకై, భారతమాత, యప్పటప్పటికి పల్కించిన పలుకులు. చాలకాలమునుంచి కొన్ని యచ్చటచ్చట, ప్రకటింపబడియు మిగతావి, బహిర్గతముగాక యుండెను. అదియుగాక యీ గేయములు, పద్యములు, లోగడ ప్రభుత్వమును, ధిక్కరించి పలుకబడి ప్రచారములోనున్నవి. కాని యన్నియుఁ బ్రకటించు స్వాతంత్ర్యములేక బయటికిరాలేదు. ఇన్పుడు స్వతంత్ర భారతి యనుగ్రహముచే యివి ప్రకటించుచున్నాను. స్వాతంత్ర్య స్థాపన (15-8-1947) తరువాత, నేటివరకు జరిగిన ఘట్టములఁగూడ నిందు చేర్కొనబడెను.

ఇందు స్వోత్కర్షకంటె, స్వరాజ్యయోధు లెట్లు, కారాగారముల గుందినది, యెట్లు స్వాతంత్ర్య సంపాదనకై

వీరవిహారము చేసింది నాయకులనుంచి యజ్ఞాత వీరునివరకు పడిన శ్రమలు విపులముగా వర్ణింపబడినవి.

ఇట్టివి బహిర్గతము జేయుట విధియని పలువురుమిత్రులు ప్రోత్సాహించుటయు, పలువురు వీటికై వ్రాసి యిమ్మనుటయు చూచి ప్రకటించుచున్నాను. దేశీయులు దీని నుచితరీతిని సమాదరింతురని గడచిన చరిత్రగదాయని తృణీకరింపక, యిప్పుడు సింహావలోకన కోరకున్నా, భావిపౌరులకు చిర స్మరణీయ చరిత్రగాను యుండగలదని విశ్వాసముతో ప్రక టించుచున్నాను.

ఇందు జైలులోనిభావప్రవృత్తులుకూడ వర్ణింపబడినవి. అవి యేరిని యుద్దేశింప బడినవికావు. ఇందాంధ్ర వీరులను కొలదిమందినే పేర్కొనబడినది. అందరిని గురించి వ్రాయ పుటలు చాలవు. చంద్రున కొక నూలుపోగన్నట్లు వీరి త్యాగ మహిమను, యీ స్వాతంత్ర్య యాత్రలో మజిలీల వర్ణనలలో పేర్కొనబడింది.

దేశీయులు నాదగు యీ "స్వాతంత్ర్య పథము" నవ లోకించి నన్ను ధన్యుని జేయుదురుగాక యని కోరుచున్నాను. ఇది ముఖ్యముగా యజ్ఞాతవీరుల కొక యశ్రుతర్పణమై చిర స్థాయి యగుగాత.

ఇట్లు,

మచిలీపట్టణము,
26-1-1949.

గు రు జా డ రా ఘ వ శ ర్మ,
మాతృపాద రేణువు.

ఓం.

# వందేమాతరం

(శ్రీ బంకించంద్ర చటర్జీ కృతము)

సుజలాం - సుఫలాం - మలయజ శీతలాం
సస్యశ్యామలాం - మాతరం ॥వందే॥ ౧
శుభ్ర జ్యోత్స్నా పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం
సుహాసినీం - సుమధురభాషిణీం
సుఖదాం - వరదాం - మాతరం ॥వందే॥ ౨
త్రింశత్కోటి కంఠకలకల నినాదకరాళే
ద్వాత్రింశత్కోటి భుజైర్ధృతఖర కరవాలే
కేబొలే మాతుమి అబలే
బాహుబల ధారిణీం - నమామితారిణీం
రిపుదళ వారిణీం - మాతరం ॥వందే॥ ౩
తుమివిద్యా తుమిధర్మ
తుమిహృది తుమిమర్మ తుమిప్రాణశరీరే
బాహుతే తుమిమాశక్తి - హృదయేతుమిమాభక్తి
తువ్వారీ ప్రతిమాగడి - మందిరే మందిరే ॥వందే॥ ౪
తుంహ్విదుర్గాదశ ప్రహరణధారిణీ
కమలా - కమలదళవిహారిణీ
వాణీ విద్యాదాయినీ - నమామిత్వాం
కమలాం - అమలాం-అతులాం - మాతరం ॥వందే॥ ౫
శ్యామలాం - సరళాం - సుస్మితాం
భూషితాం- ధరణీం - భరణీం - మాతరం ॥వందే॥ ౬

వందేమాతరం,

# భా ర త జా తీ య గీ త ం

( గురుదేవ్ శ్రీ రవీంద్రనాథ్ ఠాగూర్ కృతం )

జనగణమన అధినాయకజయ హే - భారతభాగ్య విధాతా !
జయ హే - జయ హే - జయ హే-జయ జయ జయ జయ హే॥
పంజాబ సింధు గుజరాత మరాటా - ద్రావిడ ఉత్కళవంగా
వింధ్య హిమాచల యమునా గంగా - ఉచ్ఛల జలధితరంగా
తవశుభ నామే జాగే - తవశుభ ఆశిషమాగే
గాహేతవ జయగాథా
జనగణ మంగళదాయక జయ హే - భారతభాగ్యవిధాతా !
జయ హే - జయ హే - జయ హే - జయజయజయజయ హే.
అహరహతవ ఆహ్వానప్రచారిత - శునితవ ఉదారవాణీ
హిందు బౌద్ధ శిఖ జైన పారశిక - ముసల్మాన క్రీస్తానీ
పూరబ పశ్చిమ ఆషే - తవ సింహాసనపాషే
ప్రేమహార హాాయగాథా -
జనగణ ఐక్యవిధాయక జయ హే - భారతభాగ్య విధాతా।
జయ హే- జయ హే- జయ హే- జయ జయ జయ జయ హే.
పతన అభ్యుదయ బంధురపంథా - యుగయుగ ధావితయాత్రీ
హే చిరసారథి తవరథచక్రే - ముఖరితపథదినరాత్రీ
దారుణ విప్లవమాఝే - తవ శంఖధ్వని బాజే
సంకట దుఃఖత్రాతా -
జనగణ పథపరిజాయక జయ హే - భారతభాగ్యవిధాతా !
జయ హే-జయ హే-జయ హే - జయ జయ జయ జయ హే॥
ఘోరతిమిరఘన నిబిడనిశీథే - పీడిత మూర్ఛితదేశే

జాగ్రత చిరతవ అవిచలమంగళే - నతనయనే - అనిమేషే॥
దుస్వప్నే ఆతంకే - రక్షాకరిలే - అంకే
స్నేహమయీ తుమిమాతా
జనగణ దుఃఖత్రాయక జయహే - భారతభాగ్యవిధాతా!
జయహే- జయహే- జయహే-జయ జయ జయ జయహే॥
రాత్రిప్రభాతల ఉదిల రవిఛవి - పూర్వ ఉదయగిరి భాలే
గాహే విహంగమ పుణ్యసమీరణ - నవజీవన రసరాలే
తవకరుణారుణరాగే-నిద్రిత భారతజాగే-తవచరణే నతమాతా॥
జయజయజయహే - జయరాజేశ్వర- భారతభాగ్యవిధాతా!
జయహే- జయహే- జయహే- జయ జయ జయ జయహే॥

## జాతీయగీతం - భారతజనని

(స్వీయం) (15-8-48)

**పల్లవి:** జయజయభారత జననీ, పావని! జయజయ॥

**అనుపల్లవి:** జయజయసకలా - నందదాయిని ॥జయజయ॥

చ ర ణ ము లు

1. హిమాలయోన్నత - సమాదర్శిని
తమోదళన, వి - ద్యాస్వరూపిణి ॥జయజయ॥
2. సంతత సస్య - శ్యామలరూపిణి
సంచితసకలై శ్వర్యదాయిని ॥జయజయ॥
3. పావనగంగా - జీవనశోభిని
పతితోద్ధారిణి - పాపవిదారిణి ॥జయజయ॥

4. మధురకుసుమఫల – మందసుహాసిని
మంజులశుకపిక – మధురసుభాషిణి ॥జయజయ॥

5. ధీరవీరవర – నారీరూపిణి
వైరివర్గసంహారిణి, తారిణి ॥జయజయ॥

6. సార్థక, ధర్మ – చక్రపతాకిని
సకలసౌఖ్యరా – జ్య ప్రదాయిని ॥జయజయ॥

7. వీరకుమార, కుమారీధామిన్నా
విశ్వకీర్తిశో – భిత శుభనామిన్నా ॥జయజయ॥

8. విశ్వలోకహిత – విజయకిరీటిని
శాశ్వతమంగళ – శాంతిదాయిని ॥జయజయ॥

(ఇందలి 6, 7 చరణములు తగ్గించి సంక్షిప్తపాఠముగా తీసికొన వచ్చును.)

## ఝ ం డా

1921 వ సంవత్సరము లగాయతు (సత్యాగ్రహోద్యమ ప్రారంభం) త్రివర్ణపతాకమే మన జాతీయజెండా. అప్పుడు కుంమకురంగుస్థానములో, యెఱుపుచార యుండేది. మూడు రంగులు భారతజాతీయసమ్మేళానికి ఐక్యతకు సంకేతము. ఇందు ఎఱుపురంగు హిందువులకు, ఆకుపచ్చ ముస్లిములకు, తెలుపు రంగు మిగతావారికి చిహ్నముగా నుండెను. రాట్నము దేశముయొక్క ఆర్థికదాస్య విమోచనకు చిహ్నం.

1931 లో అ. భా. కాంగ్రెసుకమిటీ జాతీయపతాక కమిటీవార్క్రింది సిఫార్సుల నంగీకరించి తీర్మానించిరి.

"లోగడవలెనే అడ్డవరుసరంగుచారలుగల త్రివర్ణ పతాకమే జాతీయపతాకము. కాని యిచట పేర్కొనబడినట్లు పైనుంచి క్రమముగా, దిగువవరకు (ఎఱుపురంగుస్థానే) కుంకుమరంగు, తెలుపు, ఆకుపచ్చరంగులుండవలెను. మధ్యను గల తెలుపురంగులో, నడుమ, ముదురునీలపురంగులో రాట్నముండవలెను. ఆ రంగులు మతవర్గములకుగాక, గుణములకే చిహ్నములుగా నుద్దేశింపబడినవి. కుంకుమరంగు సాహస త్యాగములకు, తెలుపు-శాంతి, సత్యములకు, యాకుపచ్చ ఆత్మవిశ్వాసము, ఔదార్యభావములకు, రాట్నము ప్రజానీకముయొక్క స్వాతంత్ర్యాశయానికి చిహ్నముగా నుండును. జెండాకొలత 3 రెట్లు పొడవు, రెండురెట్లు వెడల్పుగా నుండవలెను. ఆగస్టు 30 వ తేదీని ప్రతిష్ఠింపబడి ప్రతి ఆదివారము పతాకదినముగా పరిగణించవలెను."

## రాజ్యాంగపరిషత్తు ఆమోదించిన స్వతంత్రభారత పతాకం.

పతాకంలో పూర్వంనుంచియున్న రంగుల నట్లేయుంచి చర్ఖాస్థానే అశోకుని (సాంచీజయస్థంభంలోని) ధర్మచక్రాన్ని నిర్ధారణ చేయబడింది.



## ఝండా

ఝండా ఊంచారహే హమారా!
విజయీవిశ్వతి రంగాప్యారా ॥ఝండా॥

1. సదాశక్తి బర్సానేవాలా
ప్రేమసుధా సర్సానేవాలా
వీరోంకో హర్షానేవాలా
మాతృభూమికా తనమనసారా ॥ఝండా॥

2. స్వతంత్రతాకే — భీషణరణమేం
లడ్‌కర్‌బఢే జోశ్ క్షణక్షణమేం
కాంపే శత్రుదేఖ్‌కర్ మనమేం
మిటజావే భయసంకటసారా ॥ఝండా॥

3. ఇస్ ఝండేకే నీచే నిర్భయ
లే స్వరాజ్యయహ అవిచల నిశ్చయ
బోలో భారతమాతాకీ జయ్!
స్వతంత్రతాహీ ధ్యేయహమారా ॥ఝండా॥

4. ఇసకీ శానన జానేపావే
చాహే జానభలేహీ జావే
విశ్వవిజయకరకే దిఖలావే
తబ్ హోవే ప్రణపూర్ణహమారా ॥ఝండా॥

# జా తీ య జ ం డా.

(బేహాగ్ రాగం. ఝ్యాండుస్వరం. ఏకతాళం) (1922)

ఇదియే జాతీయ జండా!
జాతి । కిదియే ప్రాణము మాన ॥మిదియే॥

1. ఇదియెస్వరాజ్య ధ్వజము – నడుము ఫరంగీలహాజము ।
కదనమునకు దీనిబట్టి – కదలు శాంతిప్రతినబట్టి ॥ఇదియే॥
2. దేశదాస్యము బాపు – దీన దరిద్రత బాపు
దేశ- ద్రోహులమాపు – దీన, ప్రతాపముజూపు ॥ఇదియే॥
3. మతము లన్నిటికి, స – మ్మతము దీనిక్రీడ
హితముగూడ శాంతి – యుతముగ పోరాడ ॥ఇదియే॥
4. హిందువులందెఱ్ఱనై – ఇస్లాము మతమందు
పొందుగ పచ్చనై, యా – నందమును గూర్చు ॥నిదియే॥
5. ధవళమై; యితర – మతమ్ములకై వెలుగు
అవిరళ భాగ్య భో – గ్యములనీయ గలుగు ॥నిదియే॥
6. కోట్లధనము జనము – కొట్టి పొట్టనుబెట్టు
కాటకముల నెట్టు – రాట్నము గలట్టి ॥దిదియే॥
7. భారత జాతీయ – వీరరక్తమోడ్చి
చేరి నిర్మించు, స్వా – రాజ్యసౌధము దాఁచ్చి ॥నిదియే॥
8. భారతదేశము, స్వపరి – పాలనగలదని నమ్మ
నిరుపమానమైనకీర్తి – నింపివెలుగు నిజమ్మ ॥ఇదియే॥

## జాతీయ జండా.

(మోహనరాగం - ఆదితాళం) (1930)

పల్లవి:_జండా! జయుజయ భారత - పూర్ణ స్వరాజ్యజండా॥
అనుపల్లవి:_దండిగ ముప్పది - రెండుకోట్ల జను_
లండజేరి కొలు - వుండగ వెల్గెడి ॥జండా॥

చరణములు

1. ముక్కాకల నారితేరినారు
చిక్కనీయ రరికరములవీరు
లెక్కసేయ రరివర్గము విసరు
యుక్కు గుండ్ల కెద - నిత్తు రెదుర్కురు ॥జండా॥
2. నిరంకుశత; ధి - క్కరించివంచి
పరాధీనతా పాశము ద్రెంచి
బిరాన స్వేచ్ఛా - పథిచరించి
స్వరాజ్య మందిర - మలంకరించు ॥జండా॥
3. ఆర్యసమ్మతము, లైన సాహసా
దార్య గుణమ్ముల - హరితవర్ణమై
స్థైర్య, శాంతి, సత్యముల ధవళమై
ధైర్య త్యాగము - లను కేసరియౌ ॥జండా॥
4. పెనుదారిద్ర్యము - బాపగ దీన
జనశరణ్య - వజ్రాయుధమైన
అనాదియై, కా - మధేనువైన
ఘనవర్ణిని, రాట్నలక్ష్మి గల్గిన ॥జండా॥

5. త్రివర్ణ యుతమై - త్రిభువన హితమై
దివిజ స్తుతమై - తేజోయుతమై
భువిపవిత్రమై - ముక్తిదాత్రియై
కవిజన నుతమై - కననగు జాతీయ ॥జండా॥

6. సత్యాహింసా - సాధనములగొని
సత్యాగ్రహ కవ - చము మెయిబూని
సత్యప్రేమను సరణుల శాంతిని
నిత్యము తిరముగ నిల్పు నిల్తురని ॥జండా॥

7. కాయము బుద్ధిద - ప్రాయము, హేయము
ధ్యేయము మాకు సం, పూర్ణ స్వారాజ్యము
పాయనియశము - జగాననింపెదము
నీయాజ్ఞల శిరసావహించెదము ॥జండా॥

(మూకా్యికలు:- 1906, 1921, 193); సూద్యమములు)

## జా తీ య జ ం డా (1940)

జండా, యెత్తర - జాతికిముక్తిర
నిండగు శక్తిర - నిల్పర కీర్తిర ॥జండా యెత్తర॥

1. దండిగ వైరులు - గుండులు ప్రేల్చిన
చెండుచు, నెత్తురు - కండలు రాల్చిన ॥జండా॥

2. ప్రాణ మొండె, యభి - మాన మొండె, మన
ప్రాణములైనన్ - బలియొసంగి, మన॥

జండాయెత్తర! జాతికి ముక్తిర!



## జాతీయ పతాకము

(15-8-1947)

మ॥ అదె ఢిల్లీపుర కోటలోనడుమ, సౌధాగ్రంబునన్ స్వేచ్ఛమై
కదలెన్ దివ్యసుదర్శనంబనగ, చక్రంబొండు భాసిల్ల న
య్యదె జాతీయపతాక యెల్లరును,జోహారుల్ సమర్పింపఁగా
సుదినం బియ్యది, చేరరండు,తరియించున్ జన్మలీనాటితో.

## జండా

(6-11-1947) (స్వాతంత్ర్యయోధుల సమావేశం)

చే యెగురవేయరా – జాతీయజండా
హాయిగా స్వాతంత్ర్య – వాయువులలోన ॥చే॥

1. దీనికైగద మహా – ధీరులు వీరులు
ప్రాణ ధనమ్ములు – బలియిచ్చినారు ॥చే॥

2. స్వాతంత్ర్య జాతికిది – చక్కని వెలుగు
జాతిపేరు జగాన – స్థాపింపగలుగు ॥చే॥

3. దీనికైగద దేశ – దేశముల బోరి
మానమ్ము నిల్పి, సరి – మానవులైరి ॥చే॥

4. దండి యశోకుని – ధర్మచక్రాన
నిండుగా వెల్గేటి – నీజాతిజండా ॥చేయెగురవేయరా॥

# జా తీ య జ ం డా

(15-8-1948)

విహారింపనిమ్మా:- విహారింపనిమ్మా !
స్వాతంత్ర్య వినువీథి-జాతీయజండా ॥విహారింపనిమ్మా॥

1. విశ్వ విఖ్యాతిగా - విజయ నాదాలతో
విశ్వమోహనముగా - వెలసిన జండా
వీర భారతజాతి - వెలిగిన జండా ॥విహారింప॥

2. మూడు రంగులతోడి - ముచ్చటగూడి
తోడు నీడయి ధర్మ - చక్రమ్ముగూడి
క్రీడించు నీయండ - ప్రియమైన జండా ॥విహారింపనిమ్మా॥

3. వీరుల రక్తమ్ము - ధారవోసి, యరి
వీరుల నోడించి - పేర్గొన్న జండా
భారత వీరుల - జాతీయజండా ॥విహారింపనిమ్మా॥

4. సాహస త్యాగాలు - శాంతి సత్యాలు
ఆత్మ విశ్వాసాలు - ఔదార్య భావాలు
చక్కగా పాలించు - జాతీయ జండా ॥విహారింపనిమ్మా॥

5. సేతు శీతాచల - స్థిరభరతజాతి
ఖ్యాతినిల్పిన యట్టి - జాతీయజండా
స్వాతంత్ర్య భారత - జాతీయజండా ॥విహారింపనిమ్మా॥

# జాతీయ జండా

(15—8—1948)

ఆడనీరా! యెగిరి – ఆడనీరా! విప్పి
హాయిగా, భారత – జాతీయజండా ॥ఆడనీరా॥

1. మబ్బు మసక లేని – మంచిమార్గాన
తబ్బిబ్బు లేని, స్వాతంత్ర్య పీఠాన ॥ఆడనీరా॥

2. పరజాతిచేతి, లోపల జిక్కినలిగి
మరల విచ్చలవిడి – మసలగా, గలిగి ॥ఆడనీరా॥

3. వీరాధివీరుల – వేడి నెత్తురులపై
విజయస్థంభాలపై – వెలసిన జండా ॥ఆడనీరా॥

4. ధర్మ చక్రముతోడ – ధైర్యంపునీడ
తా త్రివర్ణంబుఖు – తాండవించే జండా ॥ఆడనీరా॥

5. సాహసత్యాగాలు – శాంతిసత్యాలు
ఆత్మ విశ్వాసాలు – ఔదార్యభావాలు ॥ఆడనీరా॥

6. ఈడుగా, జోడుగా – తోడి దేశాలలో
కూడి ముచ్చటలతో – క్రీడించుజండా ॥ఆడనీరా॥

7. సేతుశీతాచల – స్థిరభరతజాతి
ఖ్యాతినిల్పిన మన – జాతీయ జండా ॥ఆడనీరా॥

# దేశచరిత్ర

(గేయము - సాదసాఋక్రియ (1930)

తెలియుము - దేశచరిత్ర
తెలిసి, దేశదాస్యముబాపు-మో! భరతపుత్రా! ॥తెలియుము॥

1. పదహారువందల - పండ్రెండవయేట
భారతదేశకర్మమున—
వీడు | మొదట - బందరుపట్టణమున |
చల్లని | పాదంపెట్టెను- వర్తకమున |
కనుచు | పట్ట - ణంబులకు శీఘ్రమున |
తరలి | వర్తక - దొంగతనమున |
కొంత | రాజ్యము హ - రించెను, మన |
దేశీయ | ప్రభువుల - జీల్చి, కయ్యమున |
నౌకరి | పక్షము - జేరి, రాజ్యమున |
కొంత | భాగము హ - రించె, లంచమున |
ఇట్లె | భరతదేశమంత - పరప్రభుతపాలాయె॥

తెలియుము దేశచరిత్ర - తెలిసి।
దేశదాస్యము బాపుమో! భరతపుత్ర॥






## బాపూజీయరెస్టు

(ముఖారీరాగము) (6—4 — 1930)

వింటివా ! బ్రిటీషు – వీరుల ధైర్యము
తంటాలుపడి, పట్టి – రంట – బాపుజీని
అర్ధరాత్రి – ఒంటిగంటకు ॥వింటివా॥

1. చైత్రయాత్ర వేగ–సాగించి సాగించి – చేరె, గాంధీజి – కరాడి
బడలి । నిద్రజెందెను – సేనతోడి ।
అర్ధ । రాత్రితోడనె – తెల్లవాడి
సేన । వెలిగించె – 'టార్చి' పైబడి ।
లేప । పనియున్నదయ్యా ! నాతోడి" ।
యనగ । "బందిజేసితిమని – బాపును–పట్టిరంట ॥వింటివా॥

## బందరు - యరెస్టులు

(21—4—1930)

డాక్టరు పట్టాభిగారు, చెఱుకువాడ వేంకటనరసింహంగారు,
అయ్యదేవర కాళేశ్వరరావుగారు, స్వామి నారాయణానంద,
గంపలగూడెం జమీందారు కోటగిరి వెంకటకృష్ణారావు
గార్ల విచారణ, శిక్షజరిగినప్పుడు

(మాకొద్దీ తెల్లదొరతనము మాదిరి)

నడుములుగట్టి - పదండి !
ఇంక | తడవేల ! జడియక ||నడుములుగట్టి పదండి||
గడియ - సైపగలేమీ - కఠినప్రభుత్వము ||నడుములు||

1. నూటపది హేడంట - నోటికి తగిలించి
చాటు | దొంగలనుచు - వీడు |
ముందు | చేకెఱుంగక - పట్టుతాడు |
పైగ | జామీను, యివ్వమంటాడు |
నోటి | కూటిలోమట్టి కొట్టాడు |
వీడు - ఘాటీచేసి, బ్రతుకు-తాడింకసైపము ||నడుములు||

2. పట్టాభిగారిని - పట్టుకొన్న వదలి-పెట్టము-వదలిపెట్టాము
నోరు | కట్టిన - వదలిపెట్టాము |
కాళ్లు | గట్టిన - వదలిపెట్టాము -
కట్టి | కొట్టి జైలున - పెట్ట - విడము |
ఇంక|నిట్టిదుష్టప్రభుత-నెట్టిరాజ్యము గెలువ ||నడుములు||

3. చెఱుకువాడ – నరసింహముతో పోరు–సేయసంకల్పించెవీడు
ఇంచు । కఱయడు – తనశ క్తినేడు ।
ధర్మ । మెఱుగడు తో లుదొ ల్త – వీడు
ముప్పై।మూడుకోట్లసింగ–ముల నెదిరి పోరునే॥నడుములు॥

4. తత్త్వమసియనెడు–తత్త్వమును నేర్చి–తన్మయుడై వచ్చినాడు।
లవణు । తత్త్వము – గుర్తెరిగినాడు ।
ఇచట । తత్త్వము – రుచిజూపినాడు ।
జైలు । తత్త్వమెరుగ – వెళ్లినాడు ।
యా । ధన్యనారాయణా–నందుడానందింప ॥నడుములు॥

5. కాళేశ్వరుండెవరో ! కాన డిసుమంతైన – కాలకూటము
సుమ్ము – తనకు ॥
మింగి । భరియింప – జాలడా వెనుక ।
యోర్చి । తిమి దౌష్ట్యముల నింతదనుక ।
ఇంక । భరియింపజాల – మూ వెనుక ।
కనక । దుర్గాపురీశుని – తో, కదలు, చకచక ॥నడుములు॥

6. వెలమబొబ్బిలి శౌర్య–వీర్యముల్ రవ్వంత
వినడో, తలపడో చెఱబట్టి,
వీడు । కులుకదలచెనేమో! పట్టి ।
ప్రాణ । ముల జీల్చి – చెండాడునట్టి ।
దిది । తెలియదు – తన శక్తి వట్టి ।
దింక । తలపడు ముందు – గతియిట్టి ।
దనుచు । తెలసి యాతని – శక్తి పట్టు ।
బట్టి । కలసివెంట – రండి పట్టి
మన। వెలమపులి.–కోటగిరి–వేంకటకృష్ణునిజాడ ॥నడుములు॥

## ఉ ప్పు పా ట

(మాకొద్దీ తెల్లదొరతనముమాదిరి 1930 ఏప్రియల్)

ఉప్పుచేదాముపదండి
ప్రాణ । మర్పించియైన, స్వ - రాజ్యమిచ్చునట్టి ॥యుప్పు॥

1. ఏ దేశమందెప్పు- డెరుగనట్టియుప్పు-పన్ను వేశాడుమాపైన।
ఇంక । సైపగలేము - సుంతైన ।
నేడు । సైపగలేము - సుంతైన ।
వాడి । శాసనధిక్కారము-చేసి స్వరాజ్యపు ॥ఉప్పు॥

2. కండకావరమున - కన్నుగానని బ్రిటిషు
గర్వమ్ముగూల్పంగ - మొన్న ।
గాంధి । కబురంపి - కదలెగదన్న !
శాంతి । దండుతీసికొని - దండిచేరెగదన్న! ॥ఉప్పు॥

3. చిన్నాపురము, మనము - చేరినామని తృప్తి
జెంద ప్రయోజనములేదు ।
కోన । జేరినా లాభమ్ము లేదు ।
తాళ్ళ । పాలెం బో - పూర్తికాబోదు ।
ఆ । ఈశుడిచ్చుఉప్పు - స్వేచ్ఛననుభవింప ॥ఉప్పు॥

ఉప్పు చేసినతరువాత
(ఉప్పు చేశాము చూడండి లేక ఉప్పు కాచాము చూడండి)

# నా య రె స్టు

(మాకొద్దీ తెల్లదొరతనము. మాదిరి)

ది 16-5-1930 తేదీ ఉదయం బందరు సబ్ మేజస్ట్రీటుకోర్టులో సబ్ మేజస్ట్రీటు అడిగిన ప్రశ్నలకు, సమాధానంగా యీగేయం చెప్పబడింది.

ప్రశ్న: రాఘవశర్మగారూ ! మీరున్నూ పదిమందికలసి బందరు కరఅగ్రహారంలో ఉప్పుచేశారుట నిజమేనా !

జవాబు:_ "ఎక్కడ పదిమంది అండి" అనుచు, యీదిగువ గేయం చెప్పబడింది.

1. పల్లెపట్టణముల – పిల్లాజెల్లాకలసి – బందరురేవున మేము–
సంద్రపు – నీళ్ళు తెచ్చికాచినాము !
ఉప్పు ! కొల్లగ – వండ జేరాము !

ప్రశ్న:_ శాసనధిక్కారముకాదా !

జవాబు:_ చట్ట ! ముల్లఘించియె – కాచినాము !

కాని ! చల్లని ! యీప్రభుత్వము !
సైప ! నొల్లక – పడద్రోసి – నోరుకట్టెనయ్య॥
ఉప్పుసేయుటమానకెంక – దాన –
చప్పున రాజ్య ము – స్తంగతమునొందు ॥ఉప్పు,

(దీనికి బహుమానం 9 మాసములు కఠినశిక్ష)



నడుములుకట్టి పదండి
ఇంక గడియ సైపగ లేమీా - కఠినప్రభుత్వము॥

2. నూటనలుభై మూాడు- థాటిగ చేకొని-నాటకమాడదలంచె।
డెబ్బది।నాలుగొకటి, చేర్చి పెంచి।
మనల। నూటికి - బట్టగనెంచె।
వీని। థాటి - మనము, వే - గ్రహించే।
చట్టము। నీట - గల్పితిమి, లంఘించి।
ఉప్పు। నీట - గల్పితి - ముల్లంఘించి।
రెప్ప।పాటుసైపము-బ్రిటిషు-పాలనము ముగిసె॥నడుములు॥

3. ఎన్ని శెక్షనులున్న - సున్న వీనినెఱుగ -
తన్ని-గూల్పుదము, మనము।
దీని। కన్న-మర్మము లేదుగనుము।
గాంధి। పన్నిన - త్రోవిదియ జనుము।
దాన। గూలు - బ్రిటీషుపాలనము।
అపుడె। తెల్లవారి బ్రతుకు- తెల్లవారు, నింక ॥నడుములు॥

(పాఠాంతరము:- గడియసైపగ లేమీా - కఠినప్రభుత్వము
గడియసైపగ లేమిం - గ్లాండు ప్రభుత్వము)



# సైతాను బాధ

(మాళొద్దీ తెల్లదొరతనముమీదిది - 1930 కూనెల)

పడలేమీ! సైతాను బాధ!
ఇంక! గడియ - గడియకు - ప్రాణ!
కంటకమగుచుండె "పడలేమీ"

1. తాటిగెలలు నరికి - త్రాగుడు నిషేధించ -
తఱిలిన - మా పైకివీడు!
ధాటి! చేసి నూట - నలుభై మూడు!
వెంట! నోటికి - తగిలించినాడు!
న్యాయ! మేటిదో! గుర్తెరుగలేడు!
దైవ! మేటికి సైచె - నీకీడు!
మమ్ము! హద్దుపద్దులేని - అల్లరిగుంపంటాడు "పడలేమీ"

2. పెనలుకోడుపెట్టి-పీల్చి పిప్పిసేయు - పృథివి సృష్టిచేసినార!
న్యాయ! మనునది - సుంతలేదార!
భారత!' జనని - కడగండ్లు నీడేర!
దారి! కనుపించె నిదె - బాబులేర -
వేగ! రారా! గాంధిసేన - జేరిపోర! ధీర!

3. గాలి చొఱగరాని- కటికచీకటికొట్లు-కట్టిబంధించెను! వీడు!
దొంగల! బోలె మమ్మెందు - కూరాడు!
పాపం! చాల కాపల - పెట్టినాడు
రేల! బైలుకుబోవ - నీరీడు!
మురిగి! కూలమంటాడు - మాగోడు!
సుంత! యూలకించెడు - వాడులేడు!
నీడు! పాలబడితిమి - సుమ్మి నేడు!
పర! పాలనతొలగించి - పాలించుమో దేవ!

"పడలేమీ సైతానుబాధ"

# దివాలా ప్రభుత్వం

(మాకొద్దీ తెల్లదొరతనము మాదిరి)

(రాజమండ్రి జైలు. 1930 మే)

ఇదిగో! దివాలా ప్రభుత్వం
వేళ్ళతో – కదిలికూలిం దిదిగో!
కనుము – దీనిసత్వం ॥ఇదిగో॥

1. అంతులేని మనల – నెంతమందినిబట్టి
గంతులేసి బ్రతుకుతాడు।
త్రావ। ముంతసప్లయి చేయలేడు।
మల్ల। సుంతయివ్వలేనివాడు।
తొడుగ। బొంతలెన్నియ్యగలాడు।
తన। పంతమునిల్ప చూస్తాడు।
కళ్ళకు। గంతలుకట్టి యాడ్తాడు।
ప్రజ్ఞ। సుంత–దెలియు, శక్తి – సూన్యమువీనికి ॥ఇదిగో॥

2. ఎన్నాళ్ళు సైచిన- సున్నవీడికి జాలి– తిన్నగకూడు నీరీడు।
పురుగు। లన్నపుముద్ద లిస్తాడు।
మేకు। లన్నపుముద్ద లిస్తాడు।
ఉప్పు। డన్నపుసుద్ద లిస్తాడు।
వాస। నన్నుమంచి దంటాడు।
దీనికి। మిన్న లేదట మంచికూడు।
జిహ్వ। లన్నికట్టాడు యీపాడు।
కూడు। కన్న – నీరేపాన-కము, ప్రాణాధారం ॥ఇదిగో॥

3. యూనియను జాకు – బూని బ్యాండుమేళం –
తోను యూరేగింపుజేసి ।
జైలు । ఖానాలెదుట నిల్వజేసి ।
మాకు । లేనిపోనట్టి రాకాసి ।
ప్రభువు । నేనెయనుచు తిరుగునిస్సీ ।
మనము । వీని లెక్కగొనుమువాసి ।
యనుచు । ప్రాణములను తలపోసి ।
మొన్న । దీనప్రదర్శనము – తెచ్చె, మెచ్చె నెవడు। ॥ఇదిగో॥

## దే వ తా పు లు సు

4. కుళ్ళిపోయిన చచ్చు – కూరలు, ముల్లంగి –
ఉల్లిపాయలు, గలిజేరు –
వంగ । వేళ్ళు, చీడతోటకూర ।
చిరి । వేళ్ళు, ముళ్ళ తోటకూర ।
గరిక । వేళ్ళు, వెంపాలి, గోంగూర ।
పెద్ద । పల్లెకుడు, బూజుమామిడి
టెంకల్, । వెల్లుల్లి, పచ్చి బొప్పాయి ।
ఉప్పు । గల్లు, చిటికెడు – తెల్లకారం ।
చిన్న । పల్లెకుడు – నూరుడుపప్పు ।
తలప । రొయ్యిళ్ళు ఝల్లుని – నీళ్ళుగారు
పుచ్చు । నల్లచింతపండు – శేరు ।
కలిపి । నీళ్ళుజేర్చి, యిట్టిసారం ।
ఇనుప । కళ్ళాయిగాచి. యాధారు
పుగ । నిచ్చు దేవతాపులుసు – యితని శక్తిదెలుసు।ఇదిగో।

## రాజమండ్రీ జైలు

5. వరదబోలె, యిచటి-కరుగుమా వారికి-పరగ చోటులేక వేగ।
స్త్రీలను। దరిమె వేరొక జైలుకేగ।
స్త్రీలు। తిరుగుజైలే గృహముగాగ।
మాకు। పురుషుల కిదియిచ్చె, పైగ।
దినము। పెరుగు జనము, కెచటజాగ।
చూపు। నరరె! కొంచె మూగు, మూటకట్టు వేగ॥
ఇదిగో! దివాలా ప్రభుత్వం-వ్రేళ్ళతో కదిలికూలిందిదిగో॥
కనుము దీనిసత్వం॥

---

జైలు పరిస్థితులు, జైలులోని భావప్రవృత్తులు, మిత్రునకు లేఖలు పూర్వకముగా వ్రాయబడినవి. అవి వరుసగా ప్రకటించుచున్నాను.

## రాయవేలూరు (సెంట్రిలు జైలు) 5-9-1930

1వ లేఖ

సీ. రాయవేలూరని వ్రాయనోరూరు, వే
లూరు, వేలుపుటూరు తీరుగేరు।
పెట్టనిగోడల గట్టైయగడ్డల
చుట్టి మిట్టిపడెడు నట్టిపట్టు।
వరుసతీర్చిన ఘన - పర్వతశ్రేణి, సా
బంగు వెలిగిన, రమ్య భాగ్యసీమ।
వీరాధి వీరుల వేరు నిల్పినతావు
పాలేరు ప్రవహించు పంటభూమి।

గీ, కృష్ణరాయాది భూపతు లేలికగను
దనరనోచిన లావణ్య ధాత్రియిద్ది
అహహా ! దేశభక్తులకిపు డాశ్రయమ్మనయ్యె !
చిత్రము ! కాలమహాత్మ్యమార !

మిత్రమ! నీవు వ్రాయునదిమేలె! సమస్తము లీశ్వరుండు సత్పాత్రత కాలముఁ దగినవస్తువుజూచియొసంగు, దానఁబో చిత్ర మొకింత లేదు, మనుజీవుడు చేసిన పూర్వకర్మమే మాత్రమొ,యంతియేఫలము,మంచియొ, చెడ్డయొసేకురున్ గదా

గీ. మంచిచెడ్డలు యోచింప, మనముదగము
మంచియుఁ జెడ్డయుఁ, దైవమొంచి, పూర్వ
సంచితార్థమునన్, బ్రసాదించు, నెంచ
నీశ్వరుడొసంగునవియన్ని, హితము, సతము,

భాగ్యమె శాంతిచేకురుట, భాగ్యమెమాతృఋణమ్ము దీర్పుటల్ భాగ్యమె! యోగ్యవిద్యలకృపన్ దయసేయుట,లీశ్వరుండు, నా భాగ్యమికేమి చెప్ప, నృపుభాతిని, బందెల నున్నవాడ, నా రోగ్యము, సర్వదాసుఖము,రూపము, దేహము లేపుమీరెడుఁ.

బందెలనుంటిమంచు, బహుబాధల జెందితిమంచు, వేదనన్ గుందకుడయ్య, యీశుడనుకూలుడు, మాకుసతమ్ము, తన్ను హృన్మందిరమందెవండునిచి, నమ్మిక గొల్చునో ! వారి వీడునే నందుని నందనుండు, తన నందనులందన పుట్టినింటిలో.

శ్రమయనుమాట లేదు, బహుశాంతము జీవితమిచ్చుటన్, బరి
శ్రమయనుమాట లేదు, సుకరమ్ము దినమ్ము, రవంతబుచ్చ, యో
గ్యమగు తపోవనమ్ము, మరియాదలనేర్చెసి, పాఠశాల నా
శ్రమ గలిగించు నేరికిది, రమ్యసుఖంబగు బందె, సామ్ము రా.

గీ. అనుభవమ్మునకున్ మించినట్టి వస్తు
వెన్ని వత్సరముల్ మనియున్న సున్న
దొరకదది, దొరికినన్ వెంట దొరకుముక్తి
యట్టి సొమ్మెట వెదకిన, నమరుసుమ్ము.

శా. దేశీయంబగు స్వీయగీతములనార్తిన్ బాడితిన్ గొన్ని, యా
వేశం బెప్పుడుగల్గె, నప్పుడవె, చెప్పీ చెప్పకేవచ్చె, నా
హా! శౌర్యమ్ముగలంచు, జానపదుల త్యాగనందమున్, జెందెదన్
లేశమ్మున్, గనబోముసుమ్మచట, పాండిత్యమ్ము, గీతమ్ములన్.

మ॥ గ్రహచారమ్ము తెలుంగుదున్, గ్రహగతిన్ గార్యమ్ము
లూహింతు, స
త్సహవాసంబున, గొంత నేర్చితిని బో, సద్విద్య, యావిద్యచే
గ్రహదోషంబులడంగునే! తెలిసియున్ రాజాధిరాజైన, నీ
గ్రహచారమ్మునలొంగి కట్టువడు, స్వప్రారబ్ధకర్మంబులన్॥

క. పదునాల్గు వత్సరంబులు
వదలెన్, శని తనువుఁజేరి, వాని ఫలమ్మున్
హృదయ మెఱుంగును, లోకం
బిదియిదియని, వెక్కిరించు, నేమనగవలెన్.

గీ. తల్లిదండ్రులు నమ్మరు, తనయుమనసు
భార్య సందేహపడు, వేరు భావమూని
బంధుమిత్రుల పరిహాస భావమమరు
నకట! యీ గ్రహచార మహాత్మ్యమేమొ॥

చ. శ్రమమురవంత లేకయిట, సంతసభావమునొందియుంటి, నా
శ్రమమిది, నాల్గుమాసముల, సౌఖ్యము సేకుతె, సంధిరాయబా
రములు ఫలించెనేని, సుకరంబుగ, శీఘ్రమె, స్వస్థలప్రవే
శము గనవత్తు నద్దికొనసాగద, యుండెద, సుస్థిరంబుగన్.

క. క్షేమమె! సోదరి, పిల్లలు
క్షేమమె! మనబంధువితతి, క్షేమమెనీకున్,
క్షేమం బిచ్చట నందఱు,
క్షేమము వ్రాయింపుమయ్య, శీఘ్రమె లేఖన్.

2 వ లే. ఖ. (19-9-1930)

గీ. బయటగలవారికిది, పెద్దబందె కాని
లోనగలవారికిది, స్వర్గ లోకమరయ,
వేఱె చెప్పగవలెనె! మా విధమికిట్టి
వింతయానందమున్, గని విని యెఱుగము.

గీ. పగలుమిత్రులమాటలఁ బ్రాయుపొద్దు
కలతనిద్దురచే, రాత్రి కాలమరుగు
గుహలు జేరినదాదిగా, కునుకువచ్చు
నంతకును, ప్రొద్దుపుచ్చుటే, యధికభరము॥

ఉ. సందెవడంగ, మమ్ముగలసాధనపుం గుహాలందునుంతు, రా
నందముతోడ, జీవితమునన్ గల భాగ్యములం దలంచి, మే
ముందుమురేల, ప్రార్థనసేయుండెటు లెఱంగింతురందఱిన్
విందొనరింతు మంత, సరవిన్ గడ తీరిచి, నిత్యకృత్యముల్.

ఉ. మేనులుపొంగి పర్వులిడి, మిత్రులు, గల్పితవర్షధారలన్
స్నానమొనర్చువేళ, నెకసక్కెములాడెడువేళ, నొండొరుల్
బూనిపెనంగువేళ, తమ పుట్టినిల్ సనింగినయట్లు, లాత్రతన్
స్నానజలమ్ము వేగగొనుచందము, నందము, నోలలాడుటల్
కానగగాని, సంతసముగల్గునె! యిచ్చటి స్నానఘట్టమున్.

గీ. వాలఖిల్యులబోలె, యశ్వద్ధవృక్ష
ముల సమీపమునన్, ప్రొద్దుపొడుచు తోన
పలువిధంబుల నాసన ప్రకరణముల
యోగసాధన లిచట, చేయుదురు, మించి.

ఉ. కొందఱు పర్వులెత్తుదురు, కొందఱు బొజ్జలనూపుకొంచు, నీ
బందెఁ ప్రదక్షిణమ్ముసలుపన్ జనుచుందురు, కొందరిండ్లలో
వందనమాచరింతురు, ప్రభాతములందినుగూర్చి, కష్టమున్
గొందఱుచేతురిట్లు, తమకుందగునట్లు, శరీరవృద్ధికే
చందమునచ్చునో, యటులసాధనలన్ బచరింతు రిచ్చటన్.

శా. ఆహా! బాలురుదీర్చి, వృక్షములఛాయన్, వినుగావించుచున్
స్నేహాందోళిక నోలలాడుదురు, గంటే! వీరి యానందమీ
యూహాపోహాల కందఁగాలనిది, సద్యోముక్తిగాదోచు, సం
దేహంబేల! సుఖంబునుంటిమిట, రద్దీరవ్వ లేకుండగన్.

3 వ శ ఖ. (10-1-1930)

గీ. గంటగంటకు మ్రోగెడి, గంట లిచట
కాలమున్ దెల్పు, రేల బగళ్ళ, నందు
నిశల, ప్రతి పావుగంటకున్ నియతిమ్రోగు
చుండు గంటలవేళ, విసుంగు లేక
వార్డరులు హెచ్చరికల, దెల్పంగవిందు.

లాలిత రాజమందిరమునన్ బ్రతినిత్యము మేళవించు, వై
తాళికులట్లు, పెండ్లియగుతావున, మ్రోగెడి, మేళమట్లు, బా
కాలను, నూదుచుంద్రు, ప్రతి కార్యముగూరిచి, యందునీయుషః
కాలపుమేలుకొల్పు, వినగా, సరిగా ప్రతిజీవి, మేల్కొనున్.

గీ. మేలుకొల్పు, తదావిగా, జైలుద్వార
ములను దెఱచుటకున్ స్నానములకు, గంజి,
త్రాగుటకు, పనులకు నేగి తరలివచ్చు
టకును, భోజనములకు, నిద్రకు, వేయేల
నన్నిటికిఁగూతవిన్పడు, నంతజరుగు.

పిలచియొక్కొత్తదా పరుపువీచుగలట్టిది, దిండు, గోనె, కం
బళియును, రెండుదుప్పటులు, మంచితువాళ్ళొగిరెండు, నాల్గులా
గులు, మరియారుషర్టులును, కోటులు రెండుకుళాయులుఁగలీ
బులుమరిరెండురెండు, సరి మొత్తము, యిర్వదినాల్గుబందెదు
స్తులు ప్రతివారికిత్తురిట, చూడగనొ బ్రతివారివేషముల్.

గీ. ఒసగువారింక ముంత యల్యూమినియపు
కంచమున్ గ్లాసు, చీపురు, కాలిజోడు,
నద్దము, దువ్వెన్నయును, వారమరుగ, సబ్బు
బిళ్ళ, మరితలనూనెయే హుళ్ళకిసుమి.

చ. తమకుగలట్టిదీపములు, తారుపయోగముసేయవచ్చు, ని
త్యము ప్రతిదివ్వెకున్ వలయునంతగ, తైలమొసంగి, స్వీయదీ
పములెవిలేనివారలకు, బైటను దీపములుంచియున్, సహా
యముఁగడుసేతురిచ్చట ప్రయాస మొకింతయు లేదు రాత్రులన్.

మ. మనఖాతాలగలట్టి ద్రవ్యమునసామాన్ గొనన్ విల్వ వ
చ్చును సీయంగలవాని, వారమునకిచ్చున్ బేరగాడిచ్చటన్
దినుబండారములో కలమెన్మొ, మరియేదేన్ గాగితంబైన, ని
వ్వను వీలుండదు, కొన్నవస్తుల ధరల్ వ్రాతువ్వగానేటికిన్.

గీ. ఇంక కొనగలవస్తువు లేమియనగ
వలదు, కుండలు, కూజాలు, పలక, బలప
ములును, పింగాణిగిన్నెలు, బొక్కినలును
పళ్ళపొడి, సబ్బు, శీకాయ, పరిమళంపు
నూనె, లద్దములును, వాసులైను, దువ్వె
నలును, పెట్టెలు నాదిగాగలుగు వస్తు
లెన్నియైనను గొనవచ్చు, నిట్టిభాగ్య
మెల్ల గ్రుడ్డిలోమేలుసూ! మెల్లగనుట.

సీ. విడిఖైదు ననుభవించెడివారి కిట్టిదు
స్తుల పొంద వీలేమి వలనుపడదు
కఠినవర్గమునకే గల్గిన వస్తుల
బైదొల్చవలెను నిర్బంధముగను
పనియున్న లేకున్న బయటి కార్ఖానకుఁ
"హాజరుపట్టి"కై యరుగవలయు
కొంతవిశ్రాంతి చేకుఱు కాలమరుగు, నూ
తన ప్రపంచముజూడ ననువుపడును

గీ. ఇన్నివీళ్ళు, కఠినవర్గమన్న జాలు
చేసినను జేయకున్నను మాసమునకు
నాల్గుదినములవంతున గల్గుశిక్ష
తగ్గు, విడిఖైదువారికి తగ్గవేమి.

గీ. దినమునకు నర్ధరూపాయి, తిండిక్రింద
నిత్తురిట తలకది మన యిచ్చవచ్చి
నట్లు భోజనసామగ్రియైన పాలు
పండ్లు, రొట్టెయు, నేవైన బడయవచ్చు.

క. బీ తరగతి విషయంబిది
యే తరగతికూడ నింతె యిక భేదమిదే
చేతనుగల ధనమిడి సం
ప్రీతి గొలుపు వస్తులన్ని విలువగవచ్చున్.

ఆ. వె. నీ తరగతివారి స్థితియేమి చెప్పుదు
దుస్తులందు, పొందువస్తులందు
జాబులంపుటందు, సాపాటులందును
మిగుల హీనదశసుమీ! తలంప.

గీ. ఈ ప్రపంచమ్ముమాట యొక్కింతవినుతు
బాపురే! యిట్టులున్నదే! బందెయనుచు
వెగటుజెందకు, భావప్రవృత్తులివ్వి
తలప లోపములేదె, విధాతకైన.

గీ. జన్మమెత్తినదాది, యసత్యమేమి
సుంతయాడని, బహు నీతిమంతుడైన
దేనికో దానికై బొంకి తీరవలయు
మాటల చమత్కృతినిగప్పు, మరుగుపడునె!.

గీ. దొంగతన మెన్నడెరుగని, దొడ్డయోగి
యైన, చాటుగకొంత, బాహాటముగను
కొంత దొంగిలు, నవసరమింత, మాన
వునకు, సహజంబటంచు దోచినవిధాన
నెంచదొసగిది, నీతిప్రపంచమందు.

గీ. తలపపుట్టుక శ్రీమంతు తనయుడైన
పరులయాచించి, యడుగు, పాపానజనిమె
తీరు, ఆకుకో, పోకకో, యూరగాయ
కొఱకో, పొడుమునకో, బీడికొఱకో యిచట
స్వల్పవస్తువులని, కొంకు జంకులేక.

క. ప్రొద్దున లేచినదాదిగ
నిద్దురగొనువరకు, తినఁగ నేర్పరు లొటఁ
బద్దయు యోచన నెంత్రతు, యి
కెద్దియు, తలపంగ, ఫలమొకించుక లేమిఁ.

గీ. పాయసంబున్న, ఫలమున్న, బంధుమిత్రు
లున్న, స్వేచ్ఛ రవంత లేకున్న, సౌఖ్య
మందిరమె! తుచ్ఛమగుబందె, బందెకాని
యెంత సరిపుచ్చుకొనిచూడ, స్వాంతమందు.

4 వ లే ఖ. (11-11-1930)

గీ. కూడు గుడ్డ యొసంగి, కాపాడువరతు
బూని తెచ్చెను, మమ్ము, ప్రభుత్వమిటకు
జేయుచున్నార లిట రాజసేవ మాకు
నౌకరులఁగూర్చి, సేవలొందంగ దినము.

గీ. ఉచిత భోజనములు మాకు, నుచితవైద్య
శాలలుగలవు, మంగలి చాకలియును
గసవునూడ్చెడి చౌక నౌకరులుగలరు
కనుమ, వీరి, మాతోడి దొంగలెయటంచు.

గీ. చక్కనౌకార మాకు, నొసంగినార
లద్దెయడుగరు, మేముండు నంతవరకు
బుద్ధిపుట్టిన సున్నమ్ముఁబూయు, బాగొ
నర్తురీ యందమైన, ఘంటరిగృహాలు.

గీ. ఆటలఁ బాటలని మేల మాడుటలను
తఱచునదను గ్రహించి, సంతసముగాంచు
మిత్రులంగంటె ! వీరికీమాత్రమగు, వి
నోదమైనను దొరకుట, మోదముకద.

గీ. పర్వు బెట్టుటయందు నేర్పరితనమ్ము
పేకయాటలయందుఁ బ్రవీణతయును
సతము చదరంగమాడు సంగతులనేర్పు
గందురిచ్చట గొందఱు బందయైన.

చ. ఇదికదు గ్రొత్తచోటిటకునీగయు,దోమయు రా భయమ్ముజెం
దుదు రిటపాలకుల్, మనసుదోచినరీతి, చరింపవీలులే
దిదియటులుండె, నంచనెదవేమొ ! ఋటఁగననట్టిదెద్దిలే
దదియిదియేల ! సర్వమునకాశ్రయ మొక్క సువర్ణమేకదా!

చ. ఇది యొకనాడు, తృప్తిభుజియించిన చాలునె ! జీవితాశ కి
య్యది, కడుశాశ్వతంబగు గృహమ్మొకొ! చీపురుపుల్లవీడకే
పదిలముజేతు రెంతయును బ్రక్కవసించెదు వారికంటె కే
య్యది కననీయ రీవెఱచి యొక్కడిస్వార్థపరత్వమాకటా !

చ. విదితముసుమ్ము జీవితము, విత్తము చిత్తమశాశ్వతంబులం
చిది ప్రతివారికిఁ దెలియు నేమిప్రయోజనమయ్యమాకిటఁ
గది విడిపోవఁగా మనసుగల్గదు కంబళి గోనె వీడ దో
చదు మమకారమిట్లు సహజంబని తోచును,మానవాళికిన్.

గీ. ప్రేమవస్తువు దలపకే వీలులేదు
ఘనత జెందినయట్టి శ్రీగాంధియైన
భార్యయైనట్టి కస్తూరిబాయి దలప
కుండ కలుగునె తాబందెనున్న యపుడు.

గీ. ఎంతచెట్టునకున్ గాలి యంతయట్లు
బీడికొనుటాదిగా పెద్దపెద్దలంచ
ములు జెలంగును మోమోటముల్ హుళక్కి
యొక్కపరి రుచిమరగిన యూరకొనునె!
ధాతయైనను మరివాని తాతయైన

గీ. మనసు బంధింపబూనిన చరాల్న
పూర్వవాసన లెట్టులు ముంచివేయు
నట్టులే వ్యక్తులన్ బందెగట్టివేయ
బయలుపడులోన గల్గులోపములవన్ని.

గీ. స్వల్పమహాత్మ్యమె యీనీచదాస్యములకు
ముఖ్యకారణమని తోచు మున్ను వీర
లెప్పుడైన చరించిరే యిట్లు స్వేచ్ఛ
శూన్యమగు బందెనేడు చొచ్చుటనుగాక.

గీ. పాండవులు తమ యజ్ఞాతవాసకాల
మందు గడియించు నూత్నప్రద్యాదు లొకరి
కొకరు మాటుగా నందిచ్చు యోజబంధె
బండ్లరొట్టెల దెప్పించి పంచుకొంద్రు.

గీ. దొంగకంటెను, దోపిడి దోపిడీల
కంటె, హంతకు లిచ్చుట ఘనులికట్టి
హంతకుల నాయకుల కప్పగింతు రిచటి
పాలనము వీరె 'కాన్విక్టువార్డరు' లని.

గీ. అవసరముబట్టి సృష్టిసేయంగ నగున
టంచు దెలియునుగద యీ ప్రపంచమందు
లేదు లేదను లోపమ్మె లేదు, ధనము
లేదా! పుడమిని కేవియు లేవు కావు.

గీ. మనసె, మరి కారణమ్మె బాధనమునకును
మోక్షమున కనుమాట ప్రత్యక్షమిచట
బందెనుండియు నెల్లెడ బ్రాకుమనసు
నిలుపలేనట్టి మనుజు సందియము దీర్చు.

గీ వనములకు నేగి యతివేసమున చరింప
దలతురేమున్న బందెలోపల వసించి
మనసు నిశ్చలముగ జేయననువుపడని
వారలెచ్చోటు వశియింప ఫలము గలదె!

గీ. కఠినవర్గమునందలి ఘనులకీయ
బడును పేరున కేదైన పనితలంతె!
యిట్టియెడలను పనిచేయుపుట్టు భోగు
భను గనన్ హృదయముమా [illegible] నకయు నెన్న

గీ॥ కలవు రెండు ప్రవృత్తులీ కారయందు
సీయదగు వాని నన్నింటిఁ జేయుటొకటి
స్వల్పసహకార మీాయని శక్తియొక్క
టనుసరింతురు వీరు తోఁచిన విధాన॥

ఎందఱో పండితుల్ కవులికెందఱుభోగులు, త్యాగులుండిరీ
బందియ, నొక్కరొక్కరు, లవంబు నికేరికిఁ దీసిపోవ, రా
నందముతోఁడ, వీరిగనినన్, దరిజేరినఁ బల్కరించినన్
దుందుడు కెల్లమాను, పరితోషముగల్గు సువిద్య యబ్బెడున్॥

౫వ తేది. (9-11-1920) ప్రమోదూత

చేతలబట్టి, పేరిడుట జెల్లు నదేరికినైన నిట్టినీ
చేతల నేమిచెప్పు! కడుసిగ్గగు, మోదము గూర్చుదూతవే,
నీ తలపేమొ! దంపతుల నిండుసుఖమ్ము, సహింపవే ప్రమో
దూత! ప్రమాదమయ్యెఁ గడుదుర్భరమా చెఱజేర్చితే మమున్

నీతి దొఱంగి, యొండొరులు నేర్చిన ప్రజ్ఞ, శతఘ్నులన్, జన
వ్రాతముఁ జెల్చి, నెత్తురులు రాల్చిన, లాభమె! ప్రేమచేతనే
భూతలమున్ జయింప సరిపోలునటంచును, దెచ్చెనీ ప్రమో
దూత, కనుండిదే! జగతిదూతగ, గాంధిని, ప్రేమమూర్తినిన్॥

ధ న్వం త రి - జ యం తి

అంతయొ యింతయో వెనుక నార్జనచేసిన పూర్వపుణ్యమే
యింతటి మంచిజన్మమిది యిచ్చెను, దీనతిరింపనాయువున్
నుంతకొరంత గల్గమియు, చూడవలెన్, మరి దేశకాలభే
దాంతర వృత్తిచే, దొసగులంటని, విద్య ప్రసాదమిచ్చు, ధ
న్వంతరి పాదపద్మముల భక్తిని గొల్తు నభీష్టసిద్ధికిన్॥



6వ లేఖ (తన భర్త బందెగొన్న పుడు సామాన్య సతీతలపోత – 19-9-1930)

ఇదె! నానోచిన పెన్నిధానమటె! నా యీ జీవితాధారమి
య్యదియా! కాలవిశేషమే మొతల క్రిందైయున్న, యీకానియా
పద పాలేసితె! దైవమా! యెటులనిల్వన్ వచ్చు, నా ప్రాణమి
ట్లుదయాహీనత బందిగొంటి వతడాలోచింపడావంతయున్॥

తనకున్ రాగల దుస్థితిన్ దెలిసియున్ దప్పించుమార్గమ్ము యో
చనసేయండు, రవంత, యిట్టిదని, యేసందర్భమందైన, సూ
చనసేయండు, తలంప, యూహకొనగా, సామాన్యుడా! కాడు, పై
కొను వెంటన్ దలపంగనేమియగునో కో! యింతపాపమ్ము కో!॥

చీమచిటుక్కుమన్న, పరిశీలన సేయు, వివేకశాలి, కే
లా! మఱపుందగిల్చెవిధి! యక్కట! కాలము కర్మమేకమై
భామల ముంపనెంచెనె! విపన్నుని, నాదగు, నోముపంట, నె
మ్మోమము, మనమ్మదీఱ, పరిపూర్తిగ గాంచెద, తృప్తిజెందెదన్॥

లేమికి దృష్టిజెందిి, సరిలే, మన మిద్దర మేకమైన నిం
కేమియులేమి లేదనుచు, నిన్నిదినాల్ గడుపంగ, నేటికే
లా! మటుమాయమైన చెలి, నగ్గలమై, మనలన్ విదల్చె, న
య్యో! మొదలన్వచించినటులుండవు, నీదుప్రమాణవైఖరుల్॥

ఏమని విన్నవింతు, గననిమ్ము, యిదేకడసారి, నీదునె
మ్మోముసుఖమ్ము, లోమఱువబోవకు మీా దురదృష్టురాలిపై
నీమురిపెంపుజూపు బడనిమ్ము, దయన్ క్షమియింపుమింక, నా
ప్రేమసుధాంబురాశి, కనుపించవు విదేమని యేమనంగలన్॥

ఉ. నాథ; యిదేల, నీ మనసు నచ్చినయట్టుల గల్గుదుస్తులే
లా! ధరియింప, నెప్పుడటులన్ గనుపట్టవదేమి! నన్నుసా
కేథనమా, రవంత వలికింపవె! నీ చిరునవ్వువిప్పి, నా
కీథరగల్గు భాగ్యములవెల్లను, నీవనినమ్మవీడెదే!.

శా. కారాగారముఁజేరినావె! పలుకంగాకార్యమే! యిప్డు న
న్నారంబంచుదలంచితయ్యొ, కరుణాపారీణ! యాశాలతన్
వేఱుంజేయఁగ గూడదంచు, గనలేవే! చేతులంబెంచియా
ధారంబొక్కటిగూర్చి, నీవె,మరి నిర్దాక్షిణ్యతన్ద్రుంపెదే!.

... ... ...

గీ. పరులు నవ్వుదురంచు, వెల్వోడఁగనీదు
దుఃఖభావము ద్రింగుచు, ద్రుంచిత్రుంచి
వలుక, దీనంపుచూడ్కుల బ్రతిమవోలె
చూచుఁదలయూచు, నిట్టూర్పు, సొమ్మసిల్లు.

బందెగొన్న భర్తభావము. (20.9-1930)

ఉ. కట్టుకొనంగబట్ట, తినఁగాఁ బిప్పట్టెడు కూడు లేదె! యి
పుట్టిన భారతీయులకు, ప్రాణపదంబగు నిన్ను బాసి యీ
కట్టిడి బందెకానఁజొరగాదలకొందునె! భారతావనిన్
బుట్టితి, మాతృదేశఋణమున్ సరితీర్పఁగఁగంకణమ్ము, జే
గట్టితిగాన, నిల్లువడిగా, దొరకొంటిని, మాతృసేవకున్.

ఉ. అతి కాఠిన్యమటంచు నెంచకుము, మర్యాదల్ రవంతేని, స
మ్మతి నేరండని, తాలనోడకు, క్షమింపఁగా నినున్ వేడెదన్
గతమున్ గూర్చి తలంపబోకుమిక, రాగానే గట్టి కౌగిళ్ళ సం
తతముఁ బాధన జేసి పీడకుము యన్యాయంపు చేసేతకున్.

7 వ లేఖ. (19-11-1930)

సీ॥ పవళింపగా శయ్యపై జేరి యొత్తిగి
గిల్లితినో లేదో కౌగలింతు వెదుట
పఠియింపఁగా నొక్క బంతి సాగునో లేదో
వీనులు విందు గావింతు పల్కి
భుజియింపఁగోరి. యాపోసన మిడితినో
లేదో, నీ వడ్డించు లీలజూతు
ఆలోచనమ్ము సేయదలంచితినో లేదో
తలఁపులన్నింట నీ తలపె నిలచు.

ఆ. నిదురకనుల నులిమి, నిలచిచూచితో లేదో
నీదు రూపె యెదుట నిలచినవ్వ
మనము దూరమైన మనసులు దూరమా!
కాలమెప్డు మనల గలుపునోకద!

గీ. నీవునాకయి మిగుల వాపోవు దేమొ
నాల్గుగోడలమధ్య యొంటరిగ లేను
నాట్యమాడుచు నీతోడ నవ్వుకొనుచు
నుందు భావప్రపంచమ్ము నందు రేల.

... ... ...

ఉ. ఆరయచిన్నవోయెను గృహమ్ము,మనమ్ము, సుఖమ్మునాడు శృ
ంగారము నేడు బందెలనుగాచిన వెన్నెల చందమయ్యె, కా
సారము పద్మశూన్యమగుసంగతి దోచెడుశయ్య, వస్తుభాం
డారములన్నిచూచియు పడంతిరొ! నిన్గనలేమికుందుదున్.

ఉ. పండుగలొక్కటొక్కటిగ పర్వెనవచ్చెను పోయె నీవునా
దండను లేకపోతివిగదా! వృథయయ్యెనవన్ని కాంచు టే
పండుగయంచు నాశగొని ప్రత్యహమున్గడు వేచియుంటి నె
న్నండొకొ!యట్టిభాగ్యపుదినమ్ము సుఖమ్ముగ గాంచగల్గుటన్.

ఉ. ఇంతటి ప్రేమమున్ను, గ్రహియింపగ జాలకపోతి, నిప్డుడీ
స్వాంతమునందు దానివిలువన్ గ్రహియింపగ గల్గెనక్కటా
వింతగదా! తలంప, కనువిచ్చిన, మూసిన, ప్రేమధార, ని
శ్చింతగ, పొంగి, పొర్లి, కడచెన్, సరిహద్దు మనమ్మశీఘ్రమే॥

గీ. కాకతీరిన యట్టి బంగారు కరణి
గాలికిన్నిల్చి, బలియు, వృక్షమ్ము పగిది
తఱచి రాచినయట్టి, రత్నమ్ముభాతి
ప్రేమలహరి, వియోగతన్ వెల్లివిరిసె॥

గీ. అతివ ! నీవలపుం జిన్నిలనెడిపూల
దండ, యిప్పుడు హృదయమ్ము దాక నేను
విస్మృతినిగందు, యానంద వీధినందు
సారెసారెకు, నువ్విళు లూరుచుందు॥

చ. పనిచిన జాబుజూడగల భాగ్యముసేకుతె, నీదుప్రేమలే
ఖని విడి జారిశోభిలెడి, కేవలమక్షర మొక్కటొక్కటిన్
గని నిను జూతునన్నిటను, గ్రమ్మఅచేష్టలు దక్కిలోదలం
తును,మరిచూచి,నవ్వుకొనుదున్ దలయూతు, దినమ్మికిట్లునూ
తనమగు జాబుచేరదుగదా! యని, నెమ్మది తత్తరిల్లుదున్॥

చ. అనయము నీదినాది,మనసక్కట, యొక్కటెకాని,దైవమీ
తనువుల రెండు చేసెనుగదా ! యని చింతిలి, వీడకేకమై
యనఁగి,పెనంగువార, మొకయప్పుడుమా క్తికహారమైన తో
చిన మధ్య లో విసుగుజెందమె, మైళ్ళకొలంది వ్యాప్తిజెం
దెను, మనమధ్యయిప్పుడు నదీనదముల్ వనపర్వతమ్ములున్॥



## జైలు పరిభాష

Inspection - ఇనాసపచ్చం
Close prison - కులాసపచ్చం
Chief warder - చీకు వార్డర్
Convict warder - కాని కార్డు లేక కమిటీవార్డు, కాన్విక్ వార్డర్
Rise - రైస్; లెగుండి
Lock up - లాకాపు; నాకప్
I. G. of prisons - జాజీ దొర
Kitchen - కునిసీ; కషిణీ
తెల్లవారుఝామున Rise అని కేకవేసి ఖైదీలను లేపువాని డ్యూటీ - రైస్‌పారా
Board - బోటు
Chart చాట
Sick - చీకు
Superentendent - చీపరె టు
File - పైల్
Solitary block - సొల్టా బిలాకు
Block - బిలాకు
Ration - రేషన్
All is well = Hell! అని వినిపిస్తుంది

To be condemned for gallows గల్లుకెయ్యడం
రైస్ - లెగుండి
Doctor - డాగు దొర
Quarantine - కోరంటు
Orderly - హాళీ
Interview - ఇంటు, మనవి
Transfer - కమానుకట్టుట
N. W, Night watch man రాత్రి కావలాదారుడు
Task - టాస్ = పని
Hcspital - అసిపటాల్, అసిపటాల్, అసిపితాల్
Lotion - [illegible] సన్
Simpie - చింపిరి (Imprisonment)
Quick march - కుక్కుమార్చి
Gangaraju - గంగరాని చిపగంజి అఫీము
C. T. Act: Criminal Tribes Act - చీటాకు కేసు
దావెల్పనాటి పైన్

## స్వాతంత్ర్య దేవత వీడుకోలు (12-1-1931)

చ. అనయము నిన్ దలంచి, హృదయమ్మున, గాంచితి, నెట్టకేలకీ
యెనిమిది మాసముల్ కడుసుఖించితి నీకథ, నెట్టిలోపముల్
గనక, సుఖింపగా మనసుగల్గిన, తోడ నెరమ్ము, లేనిచో
నినుగనవచ్చెదన్, విడచి, నిల్వగశక్యమె, యైననిప్డు నే
ననువుగబోయివచ్చెద, దయన్ సెలవిమ్ము, స్వతంత్ర దేవతా॥

# రాజమండ్రి జైలు లాటీకథ

బొబ్బిలి పాటవరుస

1930 జూను 15వ తేదీని అర్ధరాత్రి వేళ నలుబదిమంది రాజకీయ బంధీలు రాజమహేంద్రవరపు జైలునుండి రాయవేలూరు జైలుకు మార్చబడిరి. అందు ప్రధానులు శ్రీయుతులు శ్రీ డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు, డాక్టరు ఘంటసాల సీతారామశర్మ, గోనుగుంట్ల సుబ్రహ్మణ్యగుప్త, నూకల వీరరాఘవయ్య, వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి, వీరమల్లయ్య అయ్యవార్లంగారు బ్రహ్మాండం నరసింహముగారు మున్నగువారు.

రామ రామ శ్రీరామా రామా – రామా రఘురామా
శ్రీ గోపాలా రాధాలోలా – శ్రితజనపరిపాలా॥
రాజమందిర జైలున జరిగిన – తామసకృత్యములు
రాజకీయ ఖైదీలొందిన – రాక్షస ఘోరాలు
జంతుకోటి సైతము సైపగ – జాలనట్టి కష్టములు
కొంత చెప్పెదవినుడు మానవ – కోటి యోర్వని కష్టములు
రాజకీయ ఖైదీల నలభై – రాత్రివేళనే యేరాడండి
రాజమండ్రినుంచి వేలూర్ – రవాణసేయ పిలిచాడండి
రాత్రివేళనే పేరు పేరున – రమ్మని పిల్చిరి డాక్టర్ జైలర్
ఆత్రముగా మా యొంటి మచ్చలు–అన్ని పరీక్షలు పూర్తిచేసిరి
డాక్టరు సర్టిఫికేషన్ నాటక – మూఖరు కాగానే
డాక్టరుహనుమంతరావుతో–ననియెజైలరు వేగమె॥ రామ రామ॥
"సార్జెంటు కర్కోటకుడయ్యా – చల్లగ పొండయ్యా! బైట
దర్జాగా గాంధీటోపీల – ధరియించకుడు యీ పూట

గాంధికి జైయను శబ్దంబెచట - గట్టిగ విన కూడదట
పలువురబట్టి తన్నినాడట - బయట యట్టివారినినిన్న
నిలువున గాంధీ టోపీల్ దీసి - నిప్పంటించి నాడని విన్నా
శాంతముగా పొండనుచు జైలరు - సాగె వేగమె యింటివంక
ఇంతలో బ్రహ్మాండం నరసింహం - "ఎటుగుదుము మాధర్మ మింక
అనుభవించెదము కలుగు కష్టముల"-ననుచు గర్వముతో బలుక
"చనుడు వేగమే సిద్ధముగు"డని - జైలరు లోలోనగులికె
॥ రామ రామ ॥

ఇంతలోన డిప్యూటీజైలరు - "ఎవరివస్తువులనువారు
వంతుగ వచ్చి కొనిపొండని" - వార్డరుద్వారా కబురంపగ
ఒకరివెంట వస్తువులనుగొని - ఒక్కొక్కరును రాగా
"ఒకటీ మరియొకటీ" యనుచు - యొక్క వార్డరు పిలచె వేగ
అంత చెంతనున్నట్టి సుబ్ర - హ్మణ్యగుప్త వేగమెలేచి
శాంతముగా నాతనితోడ - సంబోధించె నిట్లు
"అట్లు పిలువగా కూడదు యొక్క - రనుచు పిల్వగాదగు"నన
"ఎట్లు పిలచితేనేమి! జాగ్రత! డొక్క చ్చీవ్రులు తీస్తా"ననెను
అయ్యా! నల్ల పొట్టివార్డరు - ఆఫీసుదగ్గరనున్నాడు
కొయ్య గుండెవాడు ప్రజల - కోసుకు తింటాడండి వాడు
॥ రామ రామ ॥

కాని వికట వార్డరొకడు - గడ్డమువాడు కలడండి
పూని పల్కిన పల్కులకేమి - ముసల్మాను వాడండి బాబు
మా నూకల వీరరాఘవుడు - చీకాకుగొని పల్కెనంతలో

"మూర్కొనుటకు రారమ్ము వేమా డొక్కల ప్రేవుల్ దీయుచు
ఈశ్వర కృపలేనిచో వెంట్రుక - నెవడు కదల్పగ లేడుసుమ్మీ
నశ్వరమీ తను" వనుచు నిల్చెను-అటుపై నందరు "రారమ్మీ
వంతులేలరా యీతండొక్క - వార్డరు వెళ్లకఁడెవ్వ" రనుచు
నంత నందరు రోడ్డుమీదకు - నరిగిరి నాటిస్థితిగనుచు
॥ రామ రామ ॥

ఇంతలో జైలు సూపర్నెంటు - ఇంటికిపోవుచు డాక్టరు హను
మంతరావును పిలచి చల్లగా - మర్యాదగ పల్కగను
"చూచితిరా! మీవార్డరు పల్కిన - తుచ్ఛపుమాటలహా! వీని
సైచిత మిక త్వరగా వాని - సంగతికను" డన కోపమూని
"వేగమె వాని తొలగించెద - వీడు సరిగా నడువనియెడల
వేగమెపొండు ఖులాసగ రాయ్ - వేలూరుకు నాయెడల
వేరుభావ ముంచకు"డనుచు - వెడలెను సూపర్నెంటు
ద్వారము జేర్చిరి మమ్ము అంతలో - ఘాటిగ రారమ్మంటు
॥రామ రామ॥

ఘాటి యేమని చెప్పుదునట వా - ర్డరుల ప్రభుత్వమెకాదా
కాటి కాపరుల కెక్కడిదయ్యా - కరుణగుండెలలోన గలదా
మూటముల్లెలు పరీక్ష జేసిరి - మూటముల్లె పోయినటుల
ఘాటిగ వార్డరులంతా జైలు - గేటులమూసి చీకటుల

... ... ... ...

చంకమూటల విప్పిరి చిమ్మిరి ♦ చంక సంచుల వెదకి విసరిరి
గోచిలోపల వెదకి తడవిరి ♦ కోటులోపల తట్టిచూచిరి
చింపిరిగుడ్డలు విదలించిరి ♦ చింపిరి కాగితాల్ త్రిప్పిజూచిరి

కదురు మేకులు గ్లాసుఅద్దము ♦ కలము పెన్నులు కాలిచెప్పులు
టెంకాయచిప్ప, విభూతిపండు ♦ శ్రీకాయడబ్బా సబ్బుబిళ్ళ
పరుపు దుప్పటి పాతకంబళి ♦ ఉత్తరీయము క్రొత్తధోవతి
బట్టలు పెట్టెలు భరిణలు తిరుమణి ♦
కంచాల్ గిన్నెలు చంచాల్ చెంబులు ♦
మంగల కత్తులు మట్టికూజాల్ ♦

... ... ... ...

అన్నిదింపిరి వెదకిచూచిరి – అప్పుడె త్వరగా గొనుమనిరి
పన్నిన జైలోయనగ నందరి – పట్టించిరి ద్వారములనడుమ
॥ రామ రామ ॥

ఇంతలోన ముందుగేటు – చెంత నల్లని వార్డరొకడు
గింతులిడుచు డాక్టరు హను – మంతరావట యెన్వరతడు!
జైలరుగారు పిలచిరనగనె – చంకమూటలతోను వేగ
జైలుగేటు చెంతకు డాక్టరు – హనుమంతరావు రాగ
పోలీసు సార్జెంటపుడు – పొట్టివాడు కడు క్రూరుడు
చే లాటీగొని త్రాగి అచ్చటికి – చేరె రిజర్వుతో ఆనాడు
ఒక్కగుంజు గుంజీ చెంప – నొక్కపెట్టు పెట్టె
దిక్కు తెలియక డాక్టరు మూటతో – దిమ్మని పడగానెట్టె
॥ రామ రామ ॥

ఇంతలోన రిజర్వు సైన్యము – వంతుగ నొక్కొక్కరి లాగి
పంతముతో వార్డరు లీతడు – ఫలానివాడన రేగి
లాటీలనుగొని పైకి – లాగి మోదిరి యొక్కొక్కరిని
సూటీ పోటు మాటలాడుచు – చూపించిరి క్రౌర్యమత్తరిని

జైలరు డిప్యూటీ జైలరు - సార్జెంటు కలసి పన్నిరి
మేలు! మేలు! భళి! యీ పన్నాగము - మేలు! భళి! యీ
పన్నాగము ॥ రామ రామ ॥

అటుల డాక్టరు హనుమంతుని - అట్టె తోసివిడచిర ! పైని
పటపట లాటీలతో మోదిరి - పడి మూర్ఛల దేహముపైని
"అమ్మా"యను యార్తనాదము। హనుమంతుని నోటనురాగా
గుమ్మములోపల నున్నవారికి । గుండెలు నీరయ్యె వేగ
ఆ దృశ్యము కనగా ద్వారము । అడ్డు యొక్కటిపైగా పలుక
రాదు, మెదలగరాదు, అచ్చటి । వార్డరులు సంతసమున గులికిరి
॥ రామ రామ ॥

డాక్టరు హనుమంతరావా । డాక్టరు ! గీక్టరువా ! నీవా !
డిక్టేటరట వీరందరికి । తిన్నగయియ్యాలా ! రేషన్సు
కళ్ళజోడు మరి కిళ్ళజోడు నీ । యొళ్లు మత్తెక్కెనురా
పెళ్ళిగృహమనుకొన్నావటరా జైలుసామ్మిది యిస్కూమారో
వీడొక డాక్టర్ యిస్కూమారో । డాక్టర్ యీకళ్ళజోడూ
కూడు తేరగలేదు యిచ్చట । కూర్చొని మెక్కగను నేడూ
వీడొక నాయకుడట తన్నర । వీడికి దిక్కెవ్వరో నేడు
కూడినారు మన జైలునిండ । గుంపు గుంపుగ ప్రతివార్డులో
వీడికి స్వహస్త భోజనమట । విడిగా సామాగ్రి యివ్వాలా
వీడే వైష్ణవు డీతని మారో। వేరే తెప్పాలివ్వాలా॥రామ రామ॥

... ... ... ...

కాఫీ కావలె ! రొట్టె కావలె ♦ పాలు కావలె పెరుగు కావలె
కిచన్ గావలె స్పెషల్ కిచనురా ♦ కోకోనట్సు కోకోజమ్మా

నెయ్యి కావలె బియ్యము కావలె ♦ కూర చాలదా కుండగావలె!
రొట్టెలు కావలె! రుబ్బుడుపప్పు ♦ ఎవడి సొమ్మురా! ఎక్కడిదీరా!
దాచిపెట్టితివ! తాతగాడిదిర! మారో యిస్కో మారోయిస్కో
మారో" యనుచు మాటలోపల ♦ వరుసబెట్టి మావారినందరి
బాదిరయ్యా దేహముపైని ♦ తిరిగిచూచిన యధికమయ్యె మరి
దెబ్బలబాధ యూపైన— ||రామ రామ||

... ... ... ...

"యజ్ఞనారాయణ యీతడు ♦ సుబ్రహ్మణ్యగుప్త యీతడు
డాక్టరు శర్మగారీతడు ♦ సూరి శాస్త్రిగారీతడు
నూకల వీరరాఘవు డితడు ♦ ఇతడు బ్రహ్మండం నరసింహం
అతడు స్వహస్తం వైష్ణవుడు ♦ ఇతడు స్వాములవా రింకొకడు
అతడు నాయకుం డితడు వేరొకడు ♦ కళ్ళజోడు డాక్టరుగా రీతడు
ఇతడు అతడననేల అందరు ♦ పిన్న పెద్దలుగారు వీరు
పేరెందుకురా మారోయిస్కో ♦ మారోయిస్కో మారోయిస్కో
అని డిప్యూటీ జైలరు వార్డర్ ♦ గనిపెట్టి చూపగ నందరు
సార్జెంటుతో కలసి బాదిరి ♦ ప్రత్యేకముగా డిప్యూటీ జైలరు
బాదినాడు మా వీరరాఘవుని ||రామ రామ||

... ... ... ...

చంకమూటల విసరి కొట్టిరి ♦ కొంకి కర్రలతో వీపుల నట్టిరి
మట్టికూజాల పగులగొట్టిరి ♦ లాంతర్లు బద్దలు కొట్టిరి
బడబడ యీడ్చిరి రోడ్డుపైన ♦ బడబడ మోదిరి నెత్తిపైన
గబగబ గుద్దిరి వీపుపైన ♦ గుబగుబ తన్నిరి కాళ్లపైన
కొరడాలతో కొట్టిరి వీపుపై ♦ లాటీలతో మోదిరి తలపై

కాలు బూటులతో గట్టిగ తన్నిరి ♦ నేలరాచిరి యీడ్చిరి
తన్నిరి
వారు చేసిన దుండగముల నే । వాకొనలేనయ్యా॥రామ రామ॥

...          ...          ...          ...

అటులదెబ్బలతిని మూర్ఛిలిరి♦చటుకునకొందరు చయ్యనకూలిరి
లేచిరికొందరు లేవగరైరి♦త్రోచియున్నటులపడియున్నవారిలో
వేలూరి యజ్ఞనారాయణుని ♦ వేగమె చేతుల నెత్తి కారులో
కూర్చోపెట్టిరి కొంతసేపటికి ♦ కొలదిశక్తి చేకూరె కటకట
॥రామ రామ॥

జైలుగేటు ముందట నారాత్రి♦జైలరు దయ ప్రవహింపగ రాత్రి
పదిగంటలకు కటిక చీకటుల ♦ ఎదుగు బొదుగు మోటారు
వెలుతురుల
ఆర్పి వెలింగే టార్చి లైటులో ♦ ఒకరొకరు కన వశముగాదయా
అకట దెబ్బలే వినబడనాయె ♦ పటపటమను లాటీల దెబ్బలు
ఢంఢంమను వీపుల గుద్దులు♦టప్ టప్‌మను కఱ్ఱల మోతలు
చిట్ పెటేలమను సీసాప్రేటులు♦మార్ మారనుమాట ప్రతిధ్వని
తప్ప వేరుశబ్దంబు లెచ్చటకనపడవయ్యెను వినబడవయ్యెను
॥రామరామ॥

సార్జంటు బాదుచు కొంత ♦ సాగుచు పల్కెనిట్లు సుంత
చూడుమురా బ్రిటీషుసింహము ♦ వీడెనిద్దుర, చెందె కోపము
మారోయిస్కో-మారోయనుచు♦మారిమసంగినయట్లుమోదెను
ఇంతలోన మిగిలినవారు ♦ వంతుగ యొక్కమ్మడిపైబడి
చెప్పుకోర నీ యబ్బ గాంధితో ♦ రామ రామ యంటావట్రా

మారోరాంకు మారో యిస్కో ♦ అనుచు మోదిన లాటీదెబ్బల
తనువులెల్ల గడ్డలు కట్టె ॥రామ రామ॥

ఈవిషాదాంతముననే నొక్కటి ♦ నే వినుపించెద హేయమనకుడు
దర్జామాత్రము లేదు పాపము ♦ సార్జెంటుకు సరిపోవు నెత్తులో
చివరకు మాపేరాజుగా రొకడు ♦ చిక్కినాడు సార్జెంటుకు కడకు
అప్పుడు సార్జెంటాపి యాతని ♦ విప్పిన మీసంబ్రేళ్ళతో త్రిప్పి
కొంచెము ముందుకు గుంజీలాగీ ♦ నేనొక్క లిల్లీపుట్టును
నీవొక్క లిల్లీపుట్టువు ♦ అనుచు హాస్యరస మాతడప్పు
డనుభవించినాడంటె వింటె! ॥రామరామ॥

ఇంతలో డ్రిల్లు చేయించిరి ♦ గంతులేసి రిజర్వు వార్డరులు
"రైస్‌డౌనన" యేకకాలమున ♦ లేవకపోయిన నిలుచున్నను
ఇటుకదలినను అటు మెదలినను ♦ చిటుకుమన్న మరి
గుటుకుమన్నను

పటపట తలపై లాటీదెబ్బలు ♦ కటకట తప్పకపోయె నింకెటులు
కారు యెక్కడనిగట్టిగ పలుక ♦ కారు యెక్కితే కఠినదెబ్బలు
ఎక్కకపోతే వెనుక దెబ్బలు ♦ ఎక్కితె పైగముందు దెబ్బలు
మాటకొరకుపోయిన దెబ్బలు! మాటసర్దుకొనపోయిన దెబ్బలు
నామాటనగా లాటీదెబ్బలు| అదె మాటనగా అప్పడె దెబ్బలు
ఎక్కిన వెనుకనుయెక్కు వ దెబ్బలు|ఇటులదెబ్బలమయమై ప్రాణం
బెటుల యోర్చిరో మనసోదరులు! దేహముపై లాటీలదెబ్బలు
తినిమూర్ఛిలివే లేచియెక్కరు ♦ "దాహం, దాహం"బనుచు వేడిన
దాపున గల సర్కిలు తోడనే ♦ సార్జెంటుకు తెలుపంగ బాపురే
"వాటర్ ! వాటర్ ! వాటర్ ! డ్యామిట్

తో్రహిం యింటూది వెల్‌సూన్
అనుచు వేగ సార్జెంటు పల్కెనట రామ॥ రామ॥
మన వీరరాఘవుని సామానులన్ని హరించాడు
వెనుక తిర్గి సామాను లేవియన వెంటనే దెబ్బలు కురిపించాడు
కటకట వీరరాఘవుడిది ♦ కాయమొ కాదో లేదో యప్ప
పటపట మోదిన లాటీదెబ్బల ♦ వాకొనగా లే నబ్బబ్బ
కోర్ట్ పెట్టి నడిపించిరి ♦ గుంజీలు వే తీయించిరి
పొట్టి సార్జెంటు కొట్టిన దెబ్బలు ♦ పొట్టివాడు పెట్టినయిడుములు
కళ్ళకు గట్టిన దృశ్యమయ్యెనే ♦ జైళ్ళ చరిత్ర ప్రసిద్ధమయ్యెనే
రామ॥ రామ॥
"కొందరీశ్వరుని గూర్చి వేడిరి ♦ కొందరు కృష్ణుని గూర్చి
మ్రొక్కిరి
కొందరు రాముని కోరి భజించిరి ♦ కొందరు తమ తమ
సాముల తలచిరి
కొందరీశ్వరుని గూర్చి యిట్లనిరి♦"వందనమో దేవాది దేవా!
బలహీనులకు బలమీవేగా ♦ బలవంతులకు బలమీవేగా
బలమందరికి బలమీవేగా ♦ నిలువున ప్రాణముదీసిన మే లే
పలుకవేమి హేదీనబంధూ ♦ బలమురాగదే దయాసింధూ!"
అనుచు వేడిన అనుక్షణంబే
"టైము! టైమనుచు పోలీసనగ
సాగనంపిరి, కారులపైన
సార్జెంటు, జైలరుకూడి
దర్జాగా ముసిముసి నవ్వుల

పలుకరించుకొని షికారుసేయ
డిప్యూటీ జైలరు కసిదీర
వార్డరులంతా సంతోషించిరి
"జై హనుమంతరావుకు జై జై
జై హనుమంతరావుకు జై జై"
అనుచు సార్జెంటధికారులు
స్వస్తివాచకంబుల పంపగ
రాజమండ్రి నరకమ్ము వీడిరి
రాయవేలూరుకు ప్రయాణమైరి ॥ రామ రామ ॥
ఆహా యేమని చెప్పుదు నందరి
దేహము నిండా గాయములే
ఈశ్వరు కృపచే నొకరిద్దరి
కేమొ తప్పెగాని అందరు
ఆజన్మాంతము జ్ఞాపకమ్ముగొను
నట్టిదెబ్బలు తగిలె నక్కట
రాజరాజనరేంద్రుని వీటి
తేజమిటుల మారెనె! కటకట! ॥ రామ రామ ॥



# పాంచాలి

ఉ. డైయరురాక్షసుండటు హడావిడిగా చనుదెంచి నోటికిన్
గూయగరాని పెన్ మొఱటుకూతలగూయుచు, మానహీనమున్
జేయగసాహసించె, నవినీతుల నూరకనింకసైపగా
న్యాయమె ! శక్తిగల్గిన యనాథులమే! యిటు మిన్నకుండగన్.

మ. ఒకపాంచాలిఁ బరాభవించుటనుగాదో; మూలమట్టమ్ముగా
బెకలింపంబడెఁ గౌరవాన్వయమిలన్ వేరైన లేకే, వినా
శకమున్ నాకెటులుండునక్కట, దురాశా దుర్మదాహంకృతిన్
బ్రకటింపన్ వెనుదీయనేరని, ప్రభుత్వక్రూరదుష్కృత్యముల్.

శా. లంకన్ బుట్టినవారు రాక్షసులుగారా! యన్నటుల్ పుట్టిని
శ్శంకన్ దేశముద్రోచు, నీధనపిశాచాగ్రస్తులౌ, వీరికే
వంకన్ మాటల నచ్చచెప్పినను లాభంబున్నె, వీరల్ వెసన్
జంకున్ గొంకును లేకయిల్వెడలయత్నంబాచరింపందగున్.

సీ॥ ముక్కోణములపైన నెక్కించిబాలుర
బెత్తాలగొట్టి చంపినఫలమ్ము
మలమలయెండలో నిలబెట్టి, మ్రందిన
నోరువాయియులేని వారి యుసురు
పోటుమానిసులను లాటీలమోదుచు
పొట్టలఁ బాకించునట్టి జులుముఁ
పరపురుషులకంట బడనట్టి మానవ
తుల నవమానించు దుర్మదంబు

గీ. లూరకేపోవు దయ్యమై యూరుబేరు
నిల్పకయె వంశమెల్ల, గడల్పకింక
నే మహాసతిపున్నెమ్మొ! యింతవరకు
బ్రతికినిలచిరి వీరు భూభారమైన.

శా. ఈదుశ్శాసనుడీ దురాత్మకుడు మా యిల్ద్వారగా వచ్చె మ
ర్యాదల్ నేరని దుర్మదాంధుడెటు న్యాయాన్యాయముల్ గాంచు నో
కో్క- దుర్భావముల దూలనాడి మిమ్ములన్ గ్రూరమ్ముగా వర్తిలన్
లేదే! మాకికదిక్కు-నీవగద! తల్లీ! దుర్గ! కాత్యాయనీ.

మ. క్రమతన్ మామగవారలొక్క-రుగా గ్రామాంతరంబందు కా
ర్యములన్ మన్గిచరించు వేళ పటుధైర్యస్థైర్యులై వే పరా
క్రమమున్ జూపగ సాహసించిరికధర్మంబేదో! యోజింపు మా
నము గోల్పోయిన ప్రాణమేటికిక! యెన్నాళ్ళీ ప్రజాపీడనల్.

గీ. దయ్యమైనను మరి వాని యయ్యయైన
యొడయుడైనను మరి వాని యొడయుడైన
సిగ్గువిడిచేసినట్టి దుష్కృతఫలమ్ము
లనుభవింపక యున్నె! నీయానతల్లి.

శా. వేలా! యిల్లలుకంగ పండుగగునోయీ! భీతినీకేల పాం
చాలీ దుస్సహశోకబాష్పకణసంజాతాగ్నిలోనన్ మహాం
శాళుల్ రుద్రులు నుద్భవించెదరు లక్షల్ కోట్లు వేవేగ పా
శాలన్ ద్రుంచిస్వరాజ్యమున్ గొనెద రిచ్చావర్తులైయుండఁగున్.





జననం:— 2-10-1869

నిర్యాణం:— 30-1-1948

# మహాత్మునికి ప్రియమైన ప్రార్థన గీతములు.

వైష్ణవ జనతో తేనేకహియే - జోపీడపరాయీ జాణేరే.
పరదుఃఖే ఉపకారకహేతోయే మనఅభిమానన ఆణేరే.

1. సకలలోకమాంసేనే వందేనిందానకరేకేనీరే
వాచకాఛ మననిశ్చలరాఖే ధనధన జననీతేనీరే॥

2. సమదృష్టినే తృష్ణాత్యాగీ పరస్త్రీ జేనేమాతరే
జిహ్వాఽదకే అసత్యనబోలే పరధన నవభాలేహాధరే॥

3. మోహామాయా వ్యాపేనహీ - జేనేధృఢవైరాగ్య
జేనామనమారే
రామనామ సూతాలీలాగీ - సకలతీరథ తేనాతనమారే॥

4. వణలోభీనే కపటరహితఛే - కామక్రోధనివారయారే
భణౌనరసైయోం తెనూదర్శనకరతాకుచఏకోతేరతారయారే॥
[వైష్ణవజనతోతేనేకహియే॥

రఘుపతిరాఘవ రాజారాం - పతితపావన సీతారాం
ఈశ్వరఅల్లా తేరేనాం - సబ్‌కోసన్మతిదే భగవాన్॥
రఘుపతిరాఘవ రాజారాం॥



# ప్రణతి

—o—

సీ. తనజన్మ కారణంబున బంధనగృహమ్ము
తలుపు విచ్చి వెడల దారియొసగ
తన యపూర్వపు రాక గని గభీరతరంగ
యమున వినమ్రమై యడుగు ద్రోయ
తన వేణు గీతామృతమ్ముఁ జిందంగ బృం
దావనమెల్ల సుజ్జీవముగన
తన యకుంఠిత చక్రధాటికి వైరులు
యూరు పేరును లేక యొత్తిగిల్ల

గీ. తన మహోత్తర దివ్య సందర్శనేచ్ఛ
వ్రజము సర్వార్పణముజేసి రాణగూడ
నుదయమొందిన నిజ భక్తహృదయగహ్వ
రాంతరుని పూరుషోత్తము నభినుతింతు॥

# ప్రబోధము (1922)

—o—

సీ. పశుబలం బెందు కన్పడకుండ మీయందు
పశుబలపరిపంథి బట్టుడందు
హింసయన్ మాట లేదెందును మీయందు
హింసను మడియింప నేగుడందు
కుట్రపన్నుగడలు కూడవు మీయందు
కుట్ర పన్నుగడల గూల్పుడందు
క్రోధానలజ్వాలకున్ దావులే దిందు
క్రోధానలంబార్ప గూడుడందు
గీ. ధర్మసంరంభ మిద్ది యధర్మమణచి
భరతదేశంపు బానిసత్వమ్ము బాపి
వైరులకు మీకు శుభమబ్బు పథముద్రొక్కి
తెగువ వెడలుడు వే భారతీయులార!

సీ. ఒకరొసంగు స్వరాజ్యముండునే సతతమ్ము
తనకుదానై తెచ్చుకొనినగాక
పరులపై నాధారపడి మనుకెన్నాళ్ళు
తనసాయ మొక్కటే తనకుగాని
పరజాతి ననుకరింపగ మోక్ష మబ్బునే
తనజాతి ధర్మమే తనకుగాని
తన్ను విడచి యెట్లు త్యాగమా తనదేశ
మన్నను తను గల్పికొన్న గాక
గీ. ధర్మసంరంభమిద్ది యధర్మమణచి
... ... ... భారతీయులార॥

సీ. తనజాతిమోక్షమే తనమోక్షమని తన
ప్రాణమిచ్చెడి వాడె మానవుండు
ఈలోక కల్యాణమే జాతికల్యాణ
మంచు నాహుతి యగునదియె జాతి
పరమత సహనమే స్వమతోద్ధరణమంచు
నడ్డి కాపాడెడు నదియె మతము
స్వీయదేశపు వృద్ధిఁ దృప్తినొందక ప్రక్క
దేశవృద్ధిఁగోరు దేశమదియ
గీ. సంకుచిత స్వల్ప భావదాస్యముల పట్టు
వడక నిజ సత్య ధైర్య కవచముల గొని
ధర్మరక్షణకై ముందుదారి చూప
వెడలి రండయ్య భారతవీరులార!
సీ॥ ఖద్దరెవ్వని భుజస్కంధమ్ము ధరియించునో
వానిజన్మమే పావనమ్ము
రాట్న మెవ్వరియింట రంజిల్లుచున్ దిర్గు
నో వారిగేహమే పావనమ్ము
చేతిపనుల్ లెచట చెలగి వృద్ధినిజెందునో
వారి దేశమే పావనమ్ము
సత్యమ్ము ప్రేమ యేజాతిధర్మములౌచు
బరగు నా జాతియే పావనమ్ము
గీ॥ శాంతి నెల్లెడ నెలకొల్పజాలు సైన్య
మరయ పావన మట్టి యీ భరతభూమి
జనన మొందితి మన ప్రయోజనమె! కార్య
మునసుఁ బేరు ప్రతిష్ఠ నిల్పినను గాక॥



# రాట్నగీతము

**యమునాకళ్యాణి - ఆదితాళము**

**వడుకుమురా! వడుకుమురా! వడివడి స్వేచ్ఛావాయువు బీల్చి ||వడుకు||**

1. తెలివిగలిగి వే- వడుకుమురా-నీ-దేశోద్ధరణకు-తెరగదిరా
కలిమి బలిమి-యీ-కదురేగదరా-క్రమ్మఱ రాజ్యంబియ్యు
సూత్రముర ||వడుకు||

2. ధర్మసూత్రముల-దారముదీయగ-
మర్మములను - విధ్వంసము సేయగ
నిర్మలమగు శాంతిని వెదజల్లగ-
యోర్మికల్గి మా-నసమునవడిగా ||వడుకు||

3. పరాధారమా-బ్రతుకెందుకురా-
బలాన నీశక్తిని-దెలియుమురా
స్వరాజ్యమిదె నీ-రాట్నచక్రమున-
సాధింపగశాంతి,-నహింసాపథమున ||వడుకు||

# మహాత్మాజీ 79వ వర్ధంతి.

సీ॥ మిన్ను విఱిగి, మెంత మీద బడ్డ
రవంత కదలని యచల సంకల్పమూర్తి,
కంఠమ్ము ఖండించు కటికకసాయిని
దాసోహ మనిపించు దండితపసి,
ప్రాణపరీక్ష యందైనను, బాసాడి
తప్పని నిత్య సత్యవ్రతుండు
చంపదగినయట్టి శాత్రవు నైనను
క్షమియింపఁదగు నహింసావ్రతుండు
గీ॥ ఎఱిగియో యెఱుగకయొ తా నెదిరిచేయు
దోసగులన్విప్పి శిక్షనొందుచు దనంత
ధర్మము ప్రతిష్ఠ జేసెడి కర్మయోగి
యైన గాంధీమహాత్ముని నభినుతింతు॥
సీ॥ చిర దాస్యబంధమ్ము ఛేదించి జాతికి
స్వాతంత్ర్య మిచ్చిన దాతయతడు
కట్ట బట్ట లేని యట్టిజాతికి వస్త్ర
దానమ్ముచేసిన దాతయతఁడు
గతి మోక్ష మెఱుగని పతితజాతికి ప్రాణ
దానమ్ము చేసిన దాతయతడు
చెఱుపుజేసి వెడలు పరజాతి కభయ
ప్రదాన మ్మొసంగిన దాతయతడు
గీ. ధారుణి నహింసయె పరమధర్మమనుచు
తాల్మిబోధించు జ్ఞానప్రదాత యతడు
పావనఖ్యాత ధాత్రి, మా భరతమాత
కన్న బంగారుతండ్రి మా గాంధితండ్రి
సన్నుతించెద భక్తి నంజలిఘటించి॥

సీ. బోసినవ్వుల మంచిముత్యాల నొలికించు
తాత మన్నన గన్న నేత యితడు
ఒక్కడయ్యు జాతి నొక్కపెట్టున లేవ
దీసిన యసమాన ధీరు డితడు
బక్క జిక్కియు తపః ప్రాభవంబున శాంతి
స్థాపించు ఘన తపశ్శాలి యితడు
తా మానవుండయ్యు వ్యామోహమున్ ద్రెంచి
పరము సాధించిన ప్రాజ్ఞు డితడు
గీ॥ ఇతడె జాతికి ప్రాణ మింకితడె ధనము
బంధుడీతడె సద్దయాసింధు డితడె
యితడు లేకున్న లేదు భారతధరిత్రి
యట్టి గాంధీమహాత్ముని నభినుతింతు॥
ఆ॥ హాయిగా రాజ్యమిచ్చితిం కార్థికస్వ
రాజ్యమె కొరంత, యిపుడు విభాజ్యమైన
రాజ్యముల కూర్చి పూర్ణస్వరాజ్య మిచ్చి
యేకరాజ్యముగాచేసి యేలుకొమ్మ
గాంధి! నీ భరతఖండ మఖండముగను.
మ॥ "ఇతడా గాంధిమహాత్ము
డీతడటవే! యెన్నాళ్ళ కెన్నాళ్ళకున్
గతియున్ మోక్షు మెరుంగకే
పతితమై గాసిల్లు, నీ స్వీయ భా
రతజాతిన్ గడు నుద్ధరించిన
మహాప్రాజ్ఞుండటే! యీతడే
యిత" డంను నుతియింతు నిన్
దలచి దా మింటింట మున్ముం దికన్॥

(శ్రీ)



# విశ్వమానవ సందేశము



(యమునాకల్యాణి రాగం - ఆదితాళం)

పల్లవి: స్వతంత్రభారత - పౌరుడవౌరా
స్వాతంత్ర్యము నీ సొమ్మురా !

అను: స్వార్థపరుడవై - సోదరహక్కుల
భంగపరుపకే - పాలింపుమురా॥

చరణములు :

1. ఎత్తిన తల యికదించకురా-చే
యెత్తి బానిసగ-చరియింపకురా
పొత్తుగలిగి సోదరులతో సమభా
గస్థుడనుచు జాగ్రత్తగ మెలగర ॥స్వతంత్ర॥

2. స్వీయ పరిశ్రమచేతనె హాయిగ
జీవించుటె ధర్మమురా
హేయముగా సోమరివై పరు లెవరో
చేయుదురని యాశింపకురా ॥స్వతంత్ర॥

పరదాస్యంబది పనికిరాదురా
పరపీడన యొక బ్రతుకేరా !
పరుడు నే ననుచు భావింపకురా !
ప్రతివాడును స్వరాజ్యభాగిరా ॥స్వతంత్ర॥

4. బలహీనుండని ధనహీనుండని
భావముచే గృశియింపకురా
బలవంతులకు బలమీవేరా
తెలియర నీవు స్వశక్తుడవనుచు॥ స్వతంత్ర॥

5. ధర్మకర్తవై యాస్తులన్నిటికి
ధైర్యముగా పాలింపుమురా
ధర్మాచరణమె నీ స్వధర్మమని
దండిగ చాటర లోకమున ॥స్వతంత్ర॥

6. నీలోశక్తుల మేలుకొల్పర
ఆలోచనలన్ శుద్ధుడవగురా
తాలిమిచే సద్గుణముల బెంచర
దైవత్వము సాక్షాత్కరించునుర ॥స్వతంత్ర॥

7. విశ్వమానవుల కాదేశం బిది
వినుపించెడి శ్రీ గాంధి
శాశ్వతమగు శాంతిని వెదజల్లగ
సకల ప్రపంచంబందు॥
స్వతంత్రభారతపౌరుడ వౌరా
స్వాతంత్ర్యము నీసొమ్మేరా॥

# సత్యస్మృతి

—౦—

క॥ మనసారథి మనబంధుడు
మన హితుడున్ మనగురుండు మననాయకుడున్
మన భారతసేవకుడున్
మన గాంధీభాను డస్తమయమున్ గనెగా॥

ఉ॥ ఎట్టిమహాత్మమయ్యో! జగదీశు భజింపగనున్న వేది, కా
లెత్తి నమస్కరించుతరి లెక్కదలంపక నీమహాత్మ్యమున్
పొట్టను బెట్టుకొందలచెం బో యొకపెట్టున, తూటొనర్చి నిన్
కట్టడి హంతకుండొకడునాయన! గాంధిమహాత్మ! నిర్దయన్.

ఉ. చిత్తము సంస్కరింపబడి జీవములొక్కట లేచిరాగ, చే
యెత్తినమస్కరింపజను నెంతటివాడు నినున్ గనంగ, లో
కోత్తరమూర్తి! ప్రార్థనల కొక్కట సాగి యచుంగువైచి, చే
యెత్తినమస్కరించునెడ నించుక సంశయమైన లేక, యు
న్మత్తుడొకండు, నిన్నుబరిమార్చగ, హా! విధియూరకుండెగా!

ఉ. తిట్టినదిట్టకే మరల దీవనలిచ్చి క్షమింతువే, నినున్
గొట్టినగొట్టకే, ధనము గుప్పెదు కొల్లగ వైరివాకిటన్
పట్టినపట్టు వీడవది ప్రాణముపోయెడు పట్టునైన, నీ
యట్టి యజాతశత్రునకు నక్కట యీరిపువెట్లు కల్గెనో!

ఉ. ఎట్టి సముద్రఘోష యిది! యీ యమునానదిఘోషనల్దెసల్
చుట్టి భయంకరంబగుచు శోకమహాంబుధిగాఁ దెరల్చె, నె
ప్పట్టున గుండియల్ పగులవాఱ విటుల్, మన భారతాంబక
న్నట్టిమహాత్ముఁడల్లదిగొ! యస్తమయంబగుటన్ గదా యిటుల్.

శా. కట్టా! యెట్టిదురంతకార్యము వినంగా సిగ్గగున్ మాకె, హా!
"పొట్టన్ బెట్టుకొనంగజాలిరిమహాత్మున్ భారతీయుల్, మనం
బెట్టాశించెనొ! యిట్టిదుష్కృతిక" టం-చింటింట దేశాలదూ
పట్టన్ మేము శిరమ్ము లెత్తుకొని యెబ్భంగిన్ మనంజాలనొ.

ఉ. శ్రమచే దెచ్చిస్వరాజ్యమిచ్చితివి వాత్సల్యమ్మునన్ మున్న, భ
ద్రముగా మీ పరిపాలనన్ సరిగ సంరక్షించుకొండంచు, సౌ
ఖ్యము లొందంగల పట్టునన్, వెడల ద్రోయంజాలి రీనాడు, త్యా
ద్వ్యమలానందరసప్రపూర్ణవరమూర్తిన్ తండ్రి! దౌర్భాగతన్.

శా. నీసంకల్పమె కార్యరూపమగుచున్ నీమాటె రాజాజ్ఞయై
నీ సందేశమె వేదవాక్యమగుచున్, నీతావె సుక్షేత్రమై
నీ సంబంధమె స్వర్గతుల్యమగుచున్ నిండెన్ జగంబంతటన్
నీ సాన్నిధ్యము లేని జన్మ వృధ, తండ్రీ! మాకు దిక్కేరికన్॥

సీ. మూఁగవాఁడేయనవొ, గాంధియంచు
రెండక్షరంబులు పల్కనట్టివాఁడు
గ్రుడ్డివాడగు, గాంధిరూపంబు గనకున్న
యతనిపటము జూడనట్టివాఁడు
బధిరుడగును, గాంధిపల్కు స్వాయమ్ముగా
వినకున్న యంతౌన వినని వాఁడు
హృదయమ్ము లేనివాడేయగు, గాంధి
మాహాత్మ్యమ్ము దెలియలేనట్టివాఁడు

గీ. భారతీయుడు కాడింక వాడు, గాంధి
పుట్టినది నేను పుట్టిన పుణ్యభూమి
భరతఖండమెయని గర్వపడనివాడు,
మిగిలె నీతృప్తి, నీవు లేమిని మహాత్మ !

గీ. 'బాపుజీ, బాపుజీ !'' యన్న పల్కు వింధు
''గాంధికీజయి'' యను మాటె కానుపించు
గాంధిరూప పటం బంత గాంతు; గాని
భౌతికస్వరూప మిక, కానబడదు, పడదు.

ఉ. ఎంతయొమంచివాడవుక దే, మొన మొన్నవధింపజొచ్చు, నీ
హంతకు ప్రాణముల్ మరల నాతనికిచ్చిన పుణ్యమూర్తి! ని
న్నెంతగ లోక మెన్నుకొనెనీ! వచియించెదసత్యమిందు, నిం
కింతకు నీదు మంచితనమే విషమై మరి మృత్యువాయెగా.

ఉ. ఆయమునానదీతటమునందున హాయిగ బవ్వళింపగా
బోయితివే సమస్త జనముల్ విలపింపగ, వీరి వీడగా
న్యాయమె! యెంతగాపిలచినన్ మరి రావుకదయ్య నీయశః
కాయము సంచరింపగ జగమ్మునఁజేరితె''రాము''సన్నిధిన్.

గీ. శాంతి గొనుగాక ! నీయాత్మ శాంతమూర్తి
నిత్యమగుగాక ! నీజ్యోతి సత్యమూర్తి
నీదు సూత్రముల్ జగమున నిండుగాక !
అవ్యయుడ వౌదుగాక, మహాత్మగాంధి !
కాంచెదవుగాక ! సత్యలోకమ్ము నీవ.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# బాపూజీ నిర్యాణం - గేయం (31-1-48)

నీచేతు లెట్లాడెరా ! మనగాంధినిన్ జంప, మనసొచ్చెరా
నీచ ! నీచేజాతికి, తీరని - నింద కొడిగట్టితివిరా ॥నీచేతు॥

1. ఇట్టివా డింతవరకు, జగతిలో - పుట్టనేలేదు కదరా !
నీపుట్టేమి మున్గినదిరా - గాంధిని-పొట్టనుబెట్టుకొనగ ॥నీ॥

2. నేలబ్రాకే చీమకైన, పైన - నింగినెగిరే పక్షికైన
నీటగదిలే ప్రాణికైన-దలప-నేరడే, చెఱుపెన్నడైన ॥నీ॥

3. ఈశుడని బుద్ధుడని - యేసుక్రీస్తయని
దేశదేశాలవారు దర్శించి, - తీర్థమై, కూడినారే ॥నీ॥

4. తిట్టిన తిట్టడెపుడు, మరల నిన్ దీవించి పంపుగదరా
నిన్ గొట్టిన గొట్టడకట, వైరులకు గోట్లధనముగుప్పెరా॥నీ॥

5. కట్ట బట్ట లేనిజాతి, మానమ్ము - కాపాడి - రక్షించెరా
కడజాతివానినైన, తండ్రిగా - కౌగలించుకొనియెరా ॥నీ॥

6. ఔరా ! నీగుండె, చంపితివి - రాజ్యమిచ్చినతండ్రినే!
హాయిగాననుభవింప-గా లేక-పోయితివి, మాతృద్రోహీ॥
నీచేతు లెట్లాడెరా !

# మహాత్మా ! భారతోద్ధారకా !



సీ. కదలినతీర్థమై పొదలు నీపదములఁ
బూలఁబూజింపగా బుద్ధిపుట్టు
అమృతమ్ము జిందించు విమలమౌ నీవాక్కు
ఱాతిగుండియను గరంగఁజేయుఁ
గడుసుమాంత్రికు రీతి వెడలు నీదృక్కులో
లీనమౌ నెంతటివాని మనసు
మోహానమగు నీదుమూర్తిసన్నిధినెంత
శక్తిగలాఁడును స్తబ్ధుఁడగును

గీ. ఇట్టి తేజోనిధానమౌనట్టి నిన్నుఁ
దేరిపాఱఁగఁ జూడఁగలారె యెందు?
నీకతమ్మునఁ బేర్గన నేర్చెగాక
కశ్చనయొకండు, విధిచేష్ట గడవఁగలదె ?

సీ. పాపభూయిష్ఠప్రపంచమ్మునం దింక
మనుజెల్లఁ బాపమ్ము గొనుటయుండె
కాలమ్మునకు నెంతఘనుఁడైనఁ దాకట్టు
పడకతప్పదు ధర్మబద్ధముగను
శ్రమయెంతబడ్డ నీజాతిగుర్తింపదే
విలువ గుర్తింతురా వెనుకజనము
లోకకల్యాణార్థమై కష్టపడు మహా
పురుష నిర్యాణమీకరణిని గద

అనుచు జను లాడుకొనఁగల్గె నంతె కాని
నీవు నిక్కముగా చనిపోవలేదు
జగతిలోన విద్యుద్దీప్తిచందమునను
వ్యాప్తిఁజెందితి కీర్తికాయమ్ముతోడ
యుగయుగమ్ముల శ్రీ పూరుషోత్తముడవు.

సీ. వసివాడలే దింక స్వాతంత్ర్య విజయోత్స
వారంభ నవపుష్పతోరణమ్ము
ఆరిపోలే దింక నూరూర వెల్గిన
స్వాతంత్ర్యమంగళాభంగదీప్తి
మరపురాలేదింక పురుషార్థసాధనా
తరలభ్య పవిమల త్యాగబుద్ధి
సమసిపోలేదింక సల్పినసత్యాదీ
క్షాబద్ధమౌ నహింసావ్రతమ్ము;

గీ. ఈయ లేదింక పీడదీసి యెవరివారి
రాజ్యములు పంచి శ్రీరామరాజ్యముగను,
ఔర! ఫలభుక్తిమూకల్ల చూఱవిడచి
చల్లగా జారినా, వ నాసక్తియోగి!

ఇతఁడెహరుండు నిన్ను హరియింపఁగ వేలయు కారుఁడై, మహో
ద్ధతిమెయిఁ బ్రచ్ఛజేసెను, పదంపడితా నొనరింపఁబోవు దు
ష్కృతికి,క్షమించు మన్నటుల గేలు మొగిడ్చి నమస్కరించెఁ;గా
కితరుడొకండు నిన్నుసహ్యశియించునె? యింత తెగింప నేర్చునే?

మనసుఁడొకండు నిన్నుబరిమార్పఁగ వచ్చిన కీడుసైచి, నీ
మృదు కృప వానిపైఁ జిలుకరించితి వీ తెగుదారిసేతకున్;
మదిమదినిల్పి, కేల్మొగిచినాఁడవు రాము! హరే! యటంచు, నో
ర్వఁ దరముగాని వీనియపరాధము నెమ్మదిబెట్టవింతయున్ !

జాగదియేలనయ్యా! కడసారి హరిన్ స్మరియింపు మన్నటుల్
జాగును గూర్చి హెచ్చరిక సల్పుచు, సాగిలిమ్రొక్కి, భక్తిచే
మూగిన వందలాదిగ సమూహము వెల్వడి, తా తలంపుగ
ట్టేగగ జేసికోఁగలిగె నీతఁడు; నేమనువార మక్కటా!

"నే నొనరించు కార్య మవనిన్ గలదేని యతండె నిల్పు: లే
దా, ననుగొంచు బోవును; విధాతృని చెయ్యి మెఱుంగఁజాల; మ
జ్ఞానముగాక మీర లిడు కావలికోటలు గట్టిపెట్టినన్
మానునె! మిత్తిరాక; నను మన్పఁగ మాపఁగనేర్చు దైవమే.

ప్రాణము లుండుదాక, హరిరామహరే రఘురామ యంచిలన్
మానుగ మీ రహర్నిశలు మానక సంస్మరియింపుటొప్పు నా
ప్రాణములందుగల్గు ననురక్తి బలమ్మునఁజేసి, ప్రార్థనా
స్థానము, రాఘవస్మృతినిధానము, కత్తుల బోను సేతురే ?

కర్తయు భర్తయుంక లయకర్తయు నౌ రఘురామునామసం
కీర్తన జేయుచుండ్ దనువు కేవలమున్ దృజియింప నెంచితిన్;
కర్తృతఁ బూననేల నెటుకావలెనో కద యీశ్వరేచ్ఛ! సం
హర్తనుఁ జిన్నబుచ్చఁగలనయ్యా, తనంతట వచ్చి పిల్వగా॥

మేనజనించు మృత్యువు, నిమేషము దన్నెడబాయకుండు, నె
వ్వానిని లెక్కసేయదు, కృపారహితమ్మది; యంత్యకాలమం
దైనను శ్రీహరిస్మరణ యోగకసేయుట బుద్ధి; యీపరి
జ్ఞానము గల్గువాఁడొందుగఁగల్గునె, రక్షక శిక్షకాళికిన్ !
నిత్యమె యీశరీర మది? నిత్యము శాశ్వతమైన యాత్మయే
సత్యమటంచు లో నెఱుఁగఁజాలినవానికి సర్వకాలమున్
మృత్యుభయమ్ము లేదు; దీఁక భ్రమింపఁగఁజూతురి దేల ?

పూర్వమె
ప్రోత్యజియించి భ్రాంతి తనువున్ బదిలం బొనరించితిన్ మదిన్."

అను నీ పల్కిన వేదవాక్యము లె సత్యంబాయె; నీభారతా
వనికిన్ నీవు స్వరాజ్యమీకరణి సంపాదించుటల్ వింతయే !
జనిసాఫల్యము నొందగా ధర, నహింసాధర్మమున్ నిల్పు నీ
కణుమాత్రంబగుఁ గాదె, యియ్యదిమహాత్మా !

భారతోద్ధారకా !
చరితార్థంబగు నీదు పుట్టువు, అహింసా సత్య ధర్మస్థిరా
చరణం జూపితి వద్దుజాడలఁ; ప్రపంచమ్ముక్ ప్రవర్తింపఁగాఁ
దరియించుక్ భవదీయజన్మ దగు కర్తవ్యమ్ముఁ బాలించిత
య్య! రహస్యంబిదె! నిల్చు నీదు యశమిం కాచంద్రతారా
ర్కమున్.

అఘము హరించి, అజ్ఞత రయమ్మునఁ బాప నిజాభిధేయముక్
లఘువుగ సంస్మరించు ప్రజలన్ దరిజేర్చెడి వేల్పొసంగుతక్
'రఘుపతి, రాఘవా! యని నిరంతమున్ దనుబాడికొన్న మా
నఘుని కాత్మశాంతి భువనమ్ముల నింటనునింట వెల్గుచున్ ॥

# క బ ళ వః ం

(1944-10-21 - రేషనింగు సందర్భము)



సీ॥ యజ్ఞయాగాది మహాకార్యముల సంత
సించు నీవిటు కటాక్షింపవేమి!
నిరతాన్నదాన సునిష్ఠుల నాశీర్వ
దించు నీ విటు కటాక్షించవేమి!
దేవపిత్రాదిపూజావిధులం దృప్తి
జెందు నీవిటు కటాక్షింపవేమి!
వైభవోపేత వివాహములందు గ్రీ
డించు నీవిటు కటాక్షింపవేమి!

గీ॥ ప్రకటితానంద భోగ సంపద కటాక్ష
వీక్షణ ప్రసారముల గావించుదాన
వక్కటా! యెందు దాగితివమ్మ! చెప్పుమ!
ప్రాణదాయిని! అన్నపూర్ణా! భవాని॥

సీ॥ మాపాలిపంట సమీపించు దినములే
కాని యిల్ జేరు భాగ్యంబు కలదె!
మాపసికూనల కీపూట గంజికిన్
గలదు మాపటికి మాగతి యికేమొ!
మాపు రేపున కేమి, యోపికయున్నె, యి
ట్లుపవాస మెట్లు సేయుదుము దినము
మా కన్నసంతాన మాకటికిన్ గుంద
గా జూచుచురదృష్టకాలమగునె?"

గీ॥ యనెడి హాహారవమ్ము లే వినగనయ్యె
క్షుత్క్షుధార్తుల కన్నీరు లేకమై ప్ర
వాహమున్ గన, వారించువారె వారు!
అకట! దయలేదె! మాయమ్మ! అన్నపూర్ణ!

చ॥ ధనమునకై విచారమొకో,
ధాన్యముగూర్చి కృశించుటొక్కొ, యిం
ధనమునకై ప్రయత్నమొకొ,
తాల్పగ వస్త్రపుగోర్కెయో, గృహం
బునకగు వస్తుసంచయము
బొందతలంచిన, నెప్డులేని యా
చనకు, వశమ్ముగావలసె
జన్మమిదే మనుదమ్మ మాకికన్॥

సీ॥ కనలేదా! మొన్న డక్కా మండలమున ల
క్షలకొలందిగ ప్రాణములదొరంగ
పోకలేదో! చెవి శోకించు బీహారు
రాష్ట్రజన క్షుదార్తారవమ్ము
కాంచలేదో! కళింగ జనపదస్థిత
క్షామదేవత మల్చు శవములగతి
వినలేదా! నేడాంధ్ర జనపాలిశాసన
కృతక నిపీడ దారిద్ర్యఘోష
గీ. సర్వ సస్యసంపూర్ణయౌ జననివీవు
గలుగ నీఘోరదృశ్యముల్ గాంచనగునె!
అన్నపూర్ణ భవాని వీవయ్యు నిచట
నన్నమున కింతకఱవాయెహా! ధరిత్రి॥

భయమదియేల ! యీ గృహముబందె నిజమ్ము గనంగ దేశమం
తయు నొక పెద్దబందెయకదా ! నివసించుజనాళి కింతగా
చెయి విదలించియున్ మెతుకుజిల్కగ నోచుకొనంగలేదు బం
దియనిదు, ముద్దలన్ గడుపునిండునె ! యెప్పటికీ విమోచనల్॥

ఇదియు దరిద్రదేశ మదియేని, రవంతయు చింతలేదు, సం
పదలకు పుట్టినిల్లు, యసమానపరాక్రమ దానశేముషుల్
పొదలిన రత్నగర్భ యిది ముష్కరఘోరనిపీడ శాసనా
స్పదమున లొంగి, యీపరిభవమ్మున గుందెడునేడు ! తల్లిరో!

కరుణన్ నీ పసికూనలందఱు మనంగా ద్రోవజూపింపు, ని
ష్ఠురముల్ పల్కితి, నిందజేసితినటంచున్ వీడకోయమ్మ, దు
ర్భర మీ దుస్థితి గాంచగల్గియు, దినన్ బ్రారబ్ధమే లేద ! స
త్వరమే చేర్చు, త్వదీయ సీము కరుణన్ బాలింప లేకున్నచో॥

గీ॥ రత్నగర్భయా, నిఖిల భారత ధరిత్రి
క్షామదేవత చండప్రచండలీలఁ
దాండవింప, నుపేక్షింపఁ దగునటమ్మఁ
ప్రాణదాయిని ! అన్నపూర్ణా ! భవాని !



# పదరా ! ఢిల్లీ ! (ఢిల్లీ చలో)

పదరా ! ఢిల్లీ ! వేగ - పట్టుకొందాము !
స్వాతంత్ర్యధ్వజ మట - స్థాపించుదాము ॥పదరా॥

1. నెత్తురు వరదల - నిలచిన గెడ్డ
సత్తువ గలదేని - స్వాభిమానో బిడ్డ ॥పదరా॥

2. మరఫిరంగుల జూచి - మరలి పోపోకు
పరప్రభుతకంటె మేల్ - మరణమెనీకు ॥పదరా॥

3. అలయుగంధరుకష్ట - మాలింపలేవు
ఫలము జాఱవిడచు - భాగ్యహీనుడవు ॥పదరా॥

4. నెమలిసింహాసనము - నిలచిన తావు
నమిలి మ్రింగినవారి - నణచిచేకొనవు ॥పదరా॥

5. మగలాయిలే మేటు - మహలులన్ గట్టి
మన సంపద హరించి - మరలరే కొట్టి ॥పదరా॥

6. నడిగెడ్డ మనకు, ప్రాణము మానమదిరా
తడయక నీశక్తి - ధారవోయుమురా ॥పదరా॥

7. భీష్ము డేలిన సుపవిత్రమా భూమి
కౌంతేయు లేలిన - ఘనమైన తావు ॥పదరా॥

8. పృథ్వీరాజేలిన - సాధ్వీలలామ
రాణిసంయుక్తకు - రాణివాసమ్ము ॥పదరా॥

9. అక్బరుపాదుషా - ప్రాణధనమ్ము
షాజహానుని కీర్తి - చంద్రికల కిమ్ము ॥పదరా॥

01. స్వార్ధపరులై వృధా - చచ్చిపోకండి
సార్ధకజన్ములై - సాగిరారండి ॥పదరా॥

11. హైందవరక్తం, మీయందు కలదేని
వందేమాతరం, జై - హిందనుచు భూని ॥పదరా॥

# ఆంధ్ర ప్రతిభ

సీ. ఆంధ్రులకేమి యీ యరవలకేమి చ
క్కని యొరవడియె, త్యాగయ్యగీతి
పండితులకు నేమి - పామరులకు నేమి
వెన్న బెట్టినది, పోతన్న పలుకు
పిన్నవారలకేమి పెద్దలకేమి తా
పాల ద్రావినది గోపన్నభక్తి
వీరులకేమి తా భీరులకేమి. ర
క్తమయమ్ము ఖడ్గతిక్కన్నపోటు
గీ. ఆలమున గృహమందు నిత్యము జపించు
మంత్రరాజమ్ము, మేటి తిమ్మరుసు యుక్తి
జన్మతో గల్గినట్టి, మా స్వాంతధనము
లాంధ్రమాతా! నమస్కార మమ్మ నీకు॥

సీ. తన యద్వితీయ మేధా శ్రీల శ్రితపాళి
బూర్ణకాముల జేయు భోగరాజు
తన దివ్యపూర్ణ బోధానసమలక్షణా
కృతుల నాకర్షించు కృష్ణరావు
తన దివ్యదేశ విద్యా వైభవశ్రీల
మహిమజాటిన హనుమంతరావు
తన వాక్సుధాధార ఘనరాజకీయమ్ము
జిప్పిల వర్షించు, చెలుకువాడ
గీ. ఇట్టివా రెందరినొ, గన్నయట్టి తల్లి
ధన్యురాలవు నీవు బందరుపురమ్మ!
ధన్యులము మేము నీదు సంతానమగుట
స్వీకరింపుము, మా నమస్కృతులు నేడు॥

సీ. ఆవలింపంగ బ్రేవు లవలీల నమలు గం
డరగండడైన 'పట్టాభి' చురుకు
కుప్పించి యెగసి డీకొను సింహరాజమ్ము
సమరదుందుభి 'ప్రకాశమ్ము' ములుకు
అడిగినయంత సర్వార్పణజేసెడి
త్యాగియౌ 'వేంకటప్పయ్య' పలుకు
గిరిగీచి వైరుల నరికట్టి నిల్పు వీ
రాధివీరుడు 'వరహాగిరి' చళుకు
గీ. సౌఖ్యమెఱుగక స్వీయదేశంపుసేవ
మునుగురాజర్షియౌ ' సాంబమూర్తి ' తళుకు
భాగ్యమై వెలయ నీకు లోపమ్ముగలదె!
యాంధ్రమాతా! నమస్కారమమ్మ నీకు॥

సీ. స్వాతంత్ర్యమంత్రరాజము నుగ్గుపాలతో
త్రాగినరాజు మా 'భోగరాజు'
ధైర్యసాహసగుణోదారగుణమ్ము లా
టల నేర్చుబంటు మా 'టంగుటూరు'
కొండవిఱుగ జంకుగొంకెఱుగనట్టి యౌ
దార్య భూజము మోర్యుదండి 'కొండ'
కోయని పిలచిన కోటానకోట్ల నా
కర్షించు మంత్రశిఖామణి ' గిరి '
గీ. కర్మయోగమె జీవితధర్మమని వి
రాగియై తపియించు నాయోగి ' బులుసు '
యిట్టివారెందఱినో గన్న నీవెంత ధన్య
వాంధ్రమాతా! నమస్కారమమ్మ! నీకు॥

సీ. అఖిల కర్షక సురాజ్యస్థాపనాచార్య
  ధీయుతుండో 'రంగనాయకుండు'
మానిత దేశ ప్రజానీక కార్య ని
  ర్వాహణ దీక్షితుడు 'శ్రీరామశాస్త్రి'
రాజకీయజ్ఞాన రసమాధురిన్ ప్రజన్
  జొక్కించు రాయలు 'సుబ్బరావు'
పశ్చిమ ప్రాచ్య సభ్యతల బాల్యంబాది
  పాలించు మన్నీడు 'బాపినీడు'
భారత స్త్రీ జనోద్ధారి విద్యావిశా
  రదుడు 'సలక్ష్మీనారాయణుండు'
సతత దేశహితైక చాణక్యతంత్ర కే
  ళీవిలాసుండు 'కాశేశ్వరుండు'
తన దేశయశము జాటిన 'విశ్వదాత దే
  శోద్ధారకుడు' మహాబుద్ధిశాలి
రాజ్యమ్ము దోల్త నాంధ్రమున స్థాపించు చీ
  రాలవీరుడు 'దుగ్గిరాల' విభుడు
గీ. నేల యీని నట్టుల పతాకాలతోడ
  ధైర్యశవచాల జయజయధ్వానులతోడ
తఱలు విద్యార్థి వీరబృందమ్ము సతము
  గలుగ నీకేమిలోటమ్మ కన్నతల్లి
  యాంధ్రమాతా ! నమస్కారమమ్మ నీకు॥



# ★ శ్రీ పట్టాభి! ★

(65 వ జన్మదినోత్సవము)

శా. శ్రీ రంజిల్ల నయోధ్యదివ్యనగరీ సింహాసనంబందు, సీ
తా రామామణిఁగూడి, సంపదల, నిత్యమ్ముఁ బ్రసాదించు,నా
శ్రీరాముండిల బ్రోచుగావుతఁ శుభ శ్రీలిచ్చి, పట్టాభి సీ
తా రామ ప్రభు,భోగ రాజకులసుత్రాముని,యశోధామునిన్.

సీ. ఎదిరిన చాణక్యునేని సందీకవా
గ్బంధన గావించుగడుసుదనము,
కటికరాతిని నైనఁ గరగించి, సారమ్ము
పిండ నేర్చెడిగట్టిగుండె తనము
పోటుమానిసినైన, పొడసూఁప బసిపట్టి
చూఱగొనెడి బుద్ధిచురుకుదనము
ఎట్టిదుర్ఘటకార్యమేని చే బట్టినన్,
రయమునదీర్చు, నేర్పరితనమ్ము.
గీ. తారతమ్యమెఱింగి, యందఱిని, సఫల
కార్యులంజేయు, చాకచక్యపుదనమ్ము
బరగుఁ మా భోగరాజుఁ కేల్వట్టికొనుట
మాన్యబృందావనపురమ్మ! ధన్యవీవు.

ఉ. ధీరుడ వేటికీవిటుల దిప్పెదుమోముఁ స్వరాజ్యపీఠి, చా
గోరగ రాదనోఁ మొదలెఁ కోరిక లేదనో, నీ యుపేక్షయే
కారణమైఁ చెలంగిఁ వృథగాఁజనె, యాంధ్రులయాసలన్నిఁయె
వ్వారలు సాటిచెప్పుము! భవత్ప్రతిభావిభవమ్ము బోల్చినన్
మారుపచింపకింకఁ గొనుమా! సమయమ్ము లెరింగి స్వేచ్ఛమై!

సీ. ఎవ్వానిభావ్య మహింసామహాసూత్ర
　　కారిబోధకు, సహకారియయ్యె ।
ఎవనిలేఖిని ప్రాణమిడఁ జన్మభూమి
　　యశము ప్రాకె దేశదేశమ్ములందు ।
ఎవ్వానిభారతిఁ యింపుగావర్షించె
　　తా మాతృదేశకథామృతమ్ము
ఎవ్వానితీక్ష్ణమే ధావిభవమ్ము,
　　వైరిగణమ్ముగుండెల దిగులుబఱచె.

గీ. ఎవడు కేలూనఁ బ్రతిచోట నెనయులక్ష్మి
ఎవడు పలికినఁ బ్రతిమాట నెనయుశక్తి
యట్టిఁ మా భోగరాజు వంశాబ్ధిచంద్రు
డైన పట్టాభి కెప్డు జయమ్ముఁగూర్చి
మనుచుగావుత, భారతమాతసతము॥

గీ. నేటికొకస్థానమబ్బెగా నీకతమున
తెనుఁగుబిడ్డకుఁ భూరిజాతీయసభను
స్థానమేకాదుఁ మకుటమస్తకముగాంచు
భాగ్యములభించుగాక, సత్వరమె ! మాకు॥

మ. సమయంబియ్యదె, సాగిరమ్మిక, స్వరాష్ట్రప్రతిష్ఠాపనాచార్యక
త్వముఁ నీకేలభిఘ్నించుసత్వరము, యాంధ్రప్రభవశ్రీకటా
క్షము మాకుక్ మనసారచూఱకొనుభాగ్యంబబ్బెడిక్ నీమహో
ద్యమసాఫల్యసమాచికఁబుగ జయధ్వానమ్ములున్ మ్రోగెడిక్॥

ఉ. విక్రమవత్సరమ్ము పృథివిన్ జరితార్థతనొందెఁ నీవు, త
ద్విక్రమవత్సరానఁ బ్రభవించుకతమ్మున, భూరివైరిరా
ట్చక్రము గ్రిందొనర్పగల సాహససద్గుణవిక్రమార్కుఁని
ర్వక్రపరాక్రమ ప్రతిమభాసితు దీకలితున్ నినున్ గనన్॥

గీ. సతతశుద్ధరు మంత్రనిష్ఠాగరిష్ఠ!
పూజనీయసుబ్రహ్మణ్య పుత్రరత్న!
గంగమాంబికాగర్భముక్తా ఫలంబ!
రాజ్యలక్ష్మ్యంబికా మనోరమణ! యసమ
వీర! పట్టాభిరామ! జోహారులివిగొ॥

చ. ప్రవిమలభోగరాజకులవార్నిధిపూర్ణశశాంకఁ ధాత్రినీ
కవిరళభోగభాగ్యములుదంచితకీర్తియు సౌఖ్యముల్ చిరా
యువులిడి బ్రోచుగాత సదయుండగునీశుడు జన్మవాసరో
త్సవములుగాంచు భాగ్యములొసంగెడిగావుత మాకు
నెప్పుడున్.



## 68 వ జన్మ దినోత్సవము (24-11-47

నీ పేర్నింపాపు స్వప్నమై చనుటతో నీయున్కి తామింటకున్
లోపంబన్న భయమ్ముచేతనో కో పిన్ననే బైకి రానీక, యే
పై పైమాటల బ్రొద్దుపుచ్చెదరహో ! పై వారు, నీకేమిలో
టూ ! పట్టాభి సుధీవరా ! యెఱుగ లేదా ! సర్వలోకమ్ము నిన్॥

ఒక సందేహ మనాదినుండి కలదయ్యా ! రాజ్యతంత్రాన, నె
న్నికగన్నట్టి, యొకాంధ్ర పుత్రకుడవౌ, నీవంటి జాతీయనా
యకునిన్ మన్నన సేయ లేనిది,స్వరాజ్యమ్మా! స్వతంత్రమ్మ!యిం
తకు,నాంధ్రావని పూర్వకర్మమనుదున్ బట్టాభి! నీవుండియున్॥

ఆ. తెలివి కేమిలోటు తెలుగు దేశమ్మున
ధనము కేమిలోటు, త్యాగమందు
నన్నియుండి మనకు, నధికారమే లేదు
యెన్నడైన, వినెడి, పున్నెమున్న !॥

సరిలే ! మించిన దేమిలేదిక, స్వరాష్ట్ర స్థాపనాకాలమున్
దరిచేకొన్నది, నీప్రయత్నమున, లబ్ధంబయ్యె డీనా డనం
తరమందున్ మనయాంధ్ర దేశ మిదో! కానన్ వచ్చులోకమ్ము,దా
నెరుగంజాలునిజమ్ము నిల్కడనె, యాయీనీదు సామర్థ్యముల్॥

చాణక్యుండో, యుగంధరుండని,ప్రపంచంబాడెడిన్ నిన్ను, సం
స్థానాధీశ్వరులున్ దలల్ దిగిచి, సందర్శించి, కర్తవ్యతా
జ్ఞానమ్మున్ గొని, పల్కుచుండ్రు, నిను ప్రజ్ఞావంతుగా, నిట్టిచో
నైనన్ దెల్లముగాదె నీ వెవర, వీయూ దేశ దేశమ్ములన్॥

ఎదురై డీకొన, జాలుధీరుడొకడున్నె రాజకీయమ్మునన్
బెదవిన్ విప్పఁ, గలమ్ముఁజేకొనిన, నీ విజ్ఞానమున్, బుద్ధిసం
పదలున్ జిత్రము, నిశ్చయించి, నిజగమ్యస్థానమున్ జేరుప
ట్టుదలన్, నీ కెవరయ్యసాటి, కనుపట్టున్ దీక్ష నీదెట్టిదో॥

అమితాశ్చర్య కరమ్ము, నీదు దినచర్యల్ గాంచగా, సద్గ్రం
థములన్ వ్రాసితి, వెన్నిసంస్థలను, సంస్థాపించి, పోషించితో!
శ్రమచే దేశజులింక నీ ఋణము దీర్పంజాలువారయ్య! కా
లము, ప్రాధాన్యమటంచుఁ జాటగల, కాలజ్ఞుండ వీవేగదా॥

గీ. ఐకమత్యమె కొఱత, నీ యాంధ్రదేశ
మందనెడి, యపయశమింక, ముందుబాయు
గాక, యీర్ష్యయు, దంభముల్, లేకయుండు
గాక, యో యాంధ్రమాత! నీ కరుణచేత॥



# డాక్టరు పట్టాభీ

(69 వ జన్మవాసరోత్సవము)

మ. కలదేదో యొకపేరు "బందరుకలంకారీ" యటంచున్ మహో
జ్జ్వలమై దేశములందుఁ గొంత, మచిలీపట్నమ్ము నేడింక, నీ
వలనన్ శాశ్వతకీర్తి చంద్రికలనింపన్ ఖండఖండాంతర
మ్ములఁ "పట్టాభిపుర" మ్మటంచును యశమ్మున్ గాంచు
మున్ముందికన్.

ఉ. పావనభారతక్షితికిఁ, బట్టముగట్టిరి, నేడునీకు, ము
న్నేవరిఁ యుంపరాజ్యరమ, నిల్చినదా యెముహూర్తమింతకున్
నీవును మేము ధన్యులము, నేటికి నీసరిగద్దెనెక్క, నాం
ధ్రావని పేరునిల్పితిగదయ్య, జగమ్ములఁ, భోగరాణ్మణీ!

ఉ. నీకునునీవె సాటియన, నిక్కము, దాపరికంబదేల న
య్యా! కలమూన, నిల్వఁగల, యయ్యలు, నీదగువాగ్విజృంభణన్
డీకొన, నిల్వఁజాలిన, కడిందిమగల్ కలరెంతమంది! నీ
వై కలిగించుకొన్నపుడె, బట్టబయల్‌గద వారి శక్తియున్॥

ఉ. కాలమె తెల్పఁగాఁగలదికన్ మన యాంధ్రులశక్తి వట్టివా
చాలులుగారు, కాని, తమశక్తినెఱుంగరు, వీరు భారతదే
శాల, నుతింత్రు, దేశజులసంగతి, పట్టదు, వీరికెప్డు, ర
త్నాలుగదయ్య, చూడ, మననాయకు, లాంధ్ర
ధరాతలమ్మునన్.

చ. అరువదితొమ్మిదేట మనయాంధ్రులభాగ్యమనంగ, నేడు భా
సురతగ నవ్యభారతవసుంధర నీభుజపీఠమెక్క నా
తరుణము జేరవచ్చెనుగదా! యిఁదెగ్గె కొనుమయ్య దీవనల్
చిరతరభూరిసంపద, లశేషయశోధన, మాయురున్నతుల్.

## స్వాతంత్ర్య దినము (15–8–1947.)

సీ॥ నేడుగా తమమేని నెత్తురులోడ్చి
రాజ్యశ్రీని జేకొన్న యట్టిదినము
నేడుగా జగతి బానిసజాతి యనుపేరు
పోగొట్టుకొన్నట్టి పుణ్యదినము
నేడుగా యెన్నడు వీడని దాస్యశృం
ఖలముల( ద్రెంచిన ఘనదినమ్ము
నేడుగా పరజాతినిన్ ద్రోసిరాజని
యాటగట్టించిన యట్టిదినము
గీ. నేడుగా దేశమాత పున్నెము ఫలించి
ఖండఖండాంతరముల నఖండయశము
బడయు దివ్యముహూర్త మీపర్వమందు
జేరుడి, స్వతంత్ర భారతవీరులార ॥

సీ. "డయ్యరు" చేతిలో వ్రయ్యలై తోల్త
(గట్టమ్ములన్ గుందె "పంజాబు" తల్లి
ఉరికంబములనెక్కి యుసురులర్పించిరి
ధీర "భగత్ సింగు" వీరవరులు
ప్రాయోపవేశుడై ప్రాణమర్పించె
బందియందె వీర "జతీంద్రదాసు"
శత్రుసేనలజేరి సాధింప యోధుడై
పణమొడ్డినాడు "సుబాసుబాబు"

గీ. సాధనములందు వేర్వేరు సరణులున్న
బడయు నాదర్శమొక్కటే ప్రాణములను
దృణముగా నెంచి తమమాతృదేశమునకు
ధారవోసిన యాపుణ్యవీరవరుల
సంస్మరింపుడీ! పుణ్యవాసరమునందు

సీ॥ "నౌరోజి" "గోఖలే" నాటిన స్వాతంత్ర్య
బీజమనుదినమ్ము వృద్ధినొందె
'బాలగంగాధర' ప్రముఖుండు పోషింప
వృక్షమై శాఖల వెలసెదిశల
"లాలాజి" "దాసు" "మోతీలాలు" రక్షింప
విచ్చిరమ్యముగ పుష్పించికాచె
"మదనమోహన" "గాంధి" మొదలగువారలు
పెంచి కాపాడ ఫలించె నేడు
గీ. నాయకాగ్రణులెందరెందరో జనించి
దేశమాతృఋణమ్మది తీర్చినారు
ప్రాణములధారవోసిన పావనులను
సంస్మరింపుడీ! పుణ్యవాసరమునందు॥

సీ॥ దివ్యమోహనునాజ్ఞ దీక్షాగృహమ్ముల
సలిపిన ఘనతపఃశక్తిఫలము
లాఠీలకును వెన్క లాగకయె శిరమ్ము
లొగ్గి సహించిన యోర్పుఫలము
అన్నవస్త్రములీక యున్న బందెలగుంది
చేసిన యా యుపవాసఫలము

అకట! తుపాకిగుండ్లకు ప్రాణ మొడ్డి
యంగవిహీనులగు జనాకాంక్షఫలము
గీ. కాక యీనాటి యీమహాత్కార్యమునకు
జేరగల్గుదుమే ! వారి శిథిలజీవి
తమెు పునాదిగ గట్టు సౌధమున వీరి
సంస్మరింపుడీ! పుణ్యవాసరమునందు॥

సీ॥ 'చైతన్య,' 'రామకృష్ణ' పరమహంసాదు
లాశీర్వదించిన యట్టిఫలము
అమలయశుల్, 'వివేకానంద', 'రామతీ
ర్థుల,' భిక్షలోని, మాధుర్యఫలము !
'శ్రీరవీంద్ర', 'ప్రఫుల్లరే', 'బోసు'ప్రముఖులు
కావించినట్టి సంకల్పబలము !
'అరవింద', 'రమణ మహర్షుల', పూర్ణబో
ధానంద దివ్యమాహాత్మ్య ఫలము
గీ. లేకమైనేటికి, మనల నేకముగను
జేసి, జ్ఞానమొసంగి, రంజింపఁజేసి
రట్టి, దివ్యమహాత్ముల, నాత్మలందు
సంస్మరింపుడీ ! పుణ్యవాసరమునందు॥

సీ. వృద్ధాప్యమున బందెవీడక ప్రాణముల్
ధారవోసినది 'కస్తూరితల్లి'
సత్యాగ్రహమ్మున జైలులో మరణించె
'మహదేవదేశాయి' మాన్యయశుడు

చీమూరు మిడ్నపూర్ సీమల వేనవేల్
హింసింపబడి రమాయికపు జనులు
త్రీయుక పోరి జాతీయపతాకర
క్షణ క్రింద నలిగి నష్టములగనిరి॥
గీ. ధర్మ సంరంభమనుచు సత్యాగ్రహామ్మ
టం చహింసయు రాట్నమటంచు గాంధి
బోధసేయంగ జయమును పొందు ఘనుల
సంస్మరింపుడీ! పుణ్యవాసరమునందు॥

సీ. సాహసమున స్వరాజ్యస్థాపనకు పాటు
పడ్డ 'ఝాన్సీలక్ష్మిబాయి' యొక తె
కడదాక దేశరక్షణకు పోరాడె
'నానాసాహెబు' ప్రజానాయకుండు
పరరాజ్యమున్ ద్రోయ పన్నితంత్రమ్ముల
సాధించె 'తాంతియా' యోధుడొకడు
గడగడ వణికించె నడవిభిల్లులగూర్చి
రాజ్యమున్ గొన 'రామరా'జొకండు
గీ. భారత స్వతంత్ర సంరంభ కారణమున
ప్రాణముల్ ధారవోసిరి భరతభూమి
త్యాగులై నట్టి వీరినందఱిని భక్తి
సంస్మరింపుడ! పుణ్యవాసరమునందు॥

మ. తనివిందీరక వీరమాతయను స్వాతంత్ర్యేచ్ఛచే నొక్క కే
లను జాతీయపతాకబూని మదినుల్లాసంబునన్ దేశర
క్షణకై పూరుషవీరవర్యులబలెన్ స్వాతంత్ర్యసంరంభమం
దున పాల్గొన్న మహాపతివ్రతలనెంతున్ భక్తిజోహారులన్॥

రమణీయంబుగ గుంపులన్ జయాజయారావమ్ములన్ వీరవా
క్యములన్ బల్కుచు జేరవచ్చిరిదె విద్యార్థుల్ స్వతంత్రేచ్ఛ హ
స్తములన్ దేశపతాకలన్ గొని స్వరాజ్యస్థాపనో నీముహూ
ర్తమునన్ చీవనలిమ్మహో! భరతమాతా! శ్రీసమేతా! దయన్॥

వర, 'గాంధీ, జవహర్, పటేలు, మెహతాబ్, పట్టాభి, రాజాజి, శం
కరరావ్, పంత్, అజాద్, కృపాలినులు, డాక్టర్ ఘో, షసాఘాలి, ధీ
వర రాజేంద్రుడునున్ సరోజినియు' నాపై, నెందఱో భక్తి జే
రిరి శ్రీమాతృ పదాబ్జ పీఠికి సమర్పింపగ, దా మంజలుల్॥

అదె! రారండు, స్వదేశమాతృపద పీఠారాధనామగ్నులై
యిదె వేచేరుచునున్నవారలు, స్వతంత్రేచ్ఛా మహూర్తమ్మిదే
కదిసెన్ జాగునొనర్పకే, నిలువుడీ, కైవారమున్ బట్టి య
ల్లదె! నీరాజనమున్ గ్రహించు సమయంబయ్యెన్ వెసన్ జేరుడీ॥

చనిరండో! సుఖమొందుడీ యిక యహింసాధర్మసంరంభ మె
ల్లను చాలించి యిదే విశదేగణమెల్లన్ స్వీయదేశమ్ము తా
చనుచున్నారలు నిల్వజాలక స్వరాజ్యశ్రీ భుజస్కంధ మం
దున జేరన్ శుభలగ్నమయ్యె గని సంతోషింప రారండికన్॥

అదె! ఢిల్లీ పురికోటలో నడుమ సౌధాగ్రమ్మునన్ స్వేచ్ఛమై
కదలెన్ దివ్యసుదర్శనం బనగ చక్రంబొండు భాసిల్ల న
య్యదె జాతీయపతాక యెల్లరును జోహారుల్ సమర్పింపగా
సుదినంబియ్యది. చేరరండు తరియించున్ జన్మలీనాటితో॥

అసహాయోద్యమ కారణమ్ముగ స్వరాజ్యం బెట్లు చేకూరున
య్యా! సహింప దగునే? వచింపకిక మిథ్యావాక్యమన్నట్టి నీ
రసులీనాడు గ్రహింత్రుగాక యెటు సంప్రాప్తించెనో యుద్ధి వె
క్కసమై "నవ్వీన నాపచేనెటుల" వేగఁబండె నట్టుల్ భువిఁ।

మ. ఇదిసంపూర్ణ స్వరాజ్యమెన్నటికిగాదే యైకమత్యంబునన్
మొదలన్ "బూర్ణస్వరాజ్యమున్ "ద్వరగ నిర్మింపన్
సుసాధ్యంబగున్
మదిలో భేదము లేక యెల్లరును సంపాదింపుడీ నేడెగా
సుదినంబియ్యది చేరరండు తఱియించున్ జన్మలీనాటితో॥

దీటుగ మాతృశృంఖలము ద్రెంచితివౌర! ప్రపంచమందునె
చ్చోటనుగాని శాంతముగ చొప్పడెనయ్యా! స్వరాజ్యమిట్లు పో
రాటము లేక యొండొరులు రక్తస్రవంతులు గార్చనీక యీ
నాటికి నీకృతమ్మున గొనంగలమైతిమి గాంధి! రాజ్యమున్॥

మ. అమితాశ్చర్యకరమ్ము నీస్థితి మహాత్మా! సిద్ధసంకల్ప, హ
స్తమునన్ రాట్నము ద్రిప్పుచున్ మది నహింసాసత్యమంత్రాలని
త్యముభక్తిన్ స్మరియించి తెచ్చితో! స్వరాజ్యమ్మున్ వెసన్ దాస్య
బంధములన్ ద్రెంచియు నీదు మేలిక చిరస్థాయిన్ ప్రకాశించుగా



# అజ్ఞాత వీరుల కశ్రుతర్పణము

ఇవె, లాఠీల నెదిర్చి, యుద్ధపడి, యెంతే తున్కలై రక్తముల్
స్రవియింపన్, నిలువెల్ల కూలెను, స్వరాజ్యశ్రీలగాంక్షించి,యు
ల్లవిగో! యెమ్ములు, దేశమాతయొడిలో,హాయిల్ బరున్నట్లు లు
న్నవి, వీనిని స్మరియించి జేర్చుమిక నీనాడీ పవిత్రస్థలిన్॥

తను జన్మించిన పుణ్యభూమి యిదె, స్వాతంత్ర్యమ్ము లేనట్టి,యీ
జననం బింక నిరర్థకంబను చిలన్ స్వార్థమ్ము బోనాడి, తా
నని, స్వాతంత్ర్యపిపాసచేతను, తనుత్యాగ మ్మొటన్ జేసి వో
యిన, యా వీరుల కశ్రుతర్పణము లింకిమ్మా పవిత్రస్థలిన్॥

తనధర్మంబది మాతృసేవ, తనో సంతానంబునందొక్క మొ
ల్కని, లోనెట్టి యుహమ్ము లేకయె, మహాత్యాగమ్ములన్ దేశర
క్షణకై ప్రాణము లుండుదాక యని, దీక్షన్ బోరి,ప్రాణమ్ములో
డ్డిన,యాపూజ్యుని స్మారకంబునకు దండ్డీ! ముద్దెగా, చిహ్నమా॥

సీ. ఏనాడు పుట్టిరో యేనాడుగిట్టిరో,
శయనించిరిట కీర్తిచంద్రికలను
ఏనాడు కట్టిరో యేనాడుపట్టిరో,
దీక్ష. సిద్ధించె నీ కక్షయందు
ఏనాడు వ్రాసిరో యేనాడు చేసిరో,
దానముల్ పండె నీ స్థానమందు
ఏనాడుకోరిరో యేనాడు పోరిరో,
యశ మిటనిల్చె స్వర్ణాక్షరముల

గీ. అట్టి యజ్ఞాతవీరుల గట్టి చరిత
జెప్పశక్యమె ! స్మారకచిహ్న మిదిగో!
రాల్చుమిా! భక్తి నశ్రుతర్పణము లింత
వారలకు నేడు స్వాతంత్ర్య వాసరమున॥

సీ. ఈ తునకలై జారు మొమ్మలే స్వాతంత్ర్య
వీర భారతమాత వెన్నముకలు
ఈ వీర తనుభస్మ పావనరాశులే
స్వాతంత్ర్య దేశ సంపద్విభూతి
ఈ రక్తధారలే యేరులై ప్రవహించి
భావిభారతమున పారుపంట
ఈ బంధనమ్ములే యెదిరి శత్రులగట్టి
ప్రాపించగల్గు స్వరాజ్యలక్ష్మి
గీ. ఇరుగో ! యజ్ఞాతవీరులెవ్వరో! ప్రశాంత
ముగను శయనించి రిట మాతృభూమియందు
జేయుమ! ప్రదక్షిణమ్ము పూజింపు మిచట
రాల్చుమా! నేడు యశ్రుతర్పణము లిందు ॥

సీ. నేడు స్వారాజ్యమందిరమును నిర్మించి
నారలు లోని పునాదిజూడు
నేడు రాజ్యంబేల నేతలై యూను
వీరమునిల్చె క్రిందిపాదములజూడు
నేడు స్వతంత్రులై నిలచి చరించు
స్వేచ్ఛాజనులొందు యాసక్తిజూడు
నేడు హాయిగ నింట నిదురింపగల్గు
జన మ్మనుభవించు సౌఖ్యమ్ముజూడు

గీ. ఇరుగో! యజ్ఞాతవీరులై యిట్లు నేటి
భారతస్వాతంత్ర్య సంరంభ కారణమున
ప్రమంది రిచ్చోటనె, స్వరాజ్యమందిరమ్మ
నంగ వీరలె, మరువ కెన్నడును తండ్రి!
మనుమ, వీరి యాశీర్వాదమున జగాన ॥

సీ. వీని కన్గొంటివే 'క్విటిండియా' యను
వజ్రలేపన జేసి భద్రముగను
వీరభారతజాతి వేడినెత్తురులతో
గట్టిగా నడుసు చిక్కంగ గలిపి
కట్టుచునుండె యజ్ఞాతవీరుల జీవ
రత్నాలతో మందిర మ్మితండు
రాట్నపుఁ గదును ఫిరంగులతో కాపు
పెట్టినాడిదె శాంతివీరగణము
గీ. భారతాంబగన్నట్టి బంగారుతండ్రి
జాతికి స్వరాజ్యమిచ్చినదాత, త్రాత
సత్యవర్తి మోహనగాంధి చక్రవర్తి
తిరిగిరండు! స్వాతంత్ర్య మందిరముచుట్టు!



## స్వరాజ్యయోధులకు స్వాగతము (విజయవాడ 6-11-47)

సీ. లాఠీల నుక్కుగుండ్ల నెదిర్చి ధీరులై
పోరిన జాతీయవీరులార !
సత్యాగ్రహమ్మున శాంతియోధులరయి
వెడలిన జాతీయ వీరులార !
సర్వార్పణముజేసి శాంతిసమరమ్మున
విజయులౌ జాతీయవీరులార !
బందెలగుంది, యిబ్బందులబడి, యిట
జేరిన, జాతీయ వీరులార !
గీ. త్యాగశీలురరై, కన్నతల్లిఋణము
దీర్చి, మిముగాంచి, యాశీర్వదించనున్న
దిచట, మనయాంధ్రమాత, రండిటకు భక్తి
స్వాగతముగొందు, సంతసస్వాంతులగుచు॥

(గేయము:)

1. స్వాతంత్ర్య సమరాన – జయమొంది యలసితివి
స్వాతంత్ర్యయోధుడా ! లెమ్మా !
మాత ఋణముదీర్చి, ఖ్యాతిగొన్నావు, నీ
చేతఁగావలె నెన్నొ – రమ్మా ॥స్వాతంత్ర్య॥
2. స్వాతంత్ర్య మబ్బెనని – సంతృప్తిపడకయ్య
స్వారాజ్య భవనమ్ము కట్టి
స్వాతంత్ర్య భారతా – వనిలోన నార్థిక
సాంఘిక స్వేచ్ఛ – సాధింప ॥స్వాతంత్ర్య॥
3. గాంధిమహాత్ముని – దయచేత నీనాడు
కండ్లు తెఱువగల్గి తీవు
కష్టజీవులస్థితి – గనిపెట్టుమా ! ప్రజా
రాజ్యమ్ము – స్థాపింప లెమ్మా ! ॥స్వాతంత్ర్య॥

# నేటి నైజాం

(గేయం) (విజయవాడ, 6–1'–47)

కంటివా ! ఆంధ్రులగతి యెట్టులున్నదో !
యింటిలో, బయట–నీనాడు ॥ కంటివా ॥
అంటకే, నీవూర–కుంటివా, పీనుగు
వెంట లానింక – నెల్లెడల ॥కంటివా॥

1. తోడి సోదరులెట్లు – వాడవాడలకేగి
దుఃఖములగుంద – విన్నావా !
నేడు నైజామున – బీడువారినయట్లు
పాడుగృహాలఁ గన్నావా ॥కంటివా॥

2. నీ యాంధ్ర పౌరుషము – నీ యాంధ్రజ్యోతియుట
నిలబెట్ట దలచితివ ! లేదా !
సాయపడకున్న నీ – జాతికేముప్పురా !
చప్పనఁగావ – మర్యాద ॥కంటివా ! ఆంధ్రులగతి॥



# నైజాం యుద్ధవీరులకు

(బందరులో స్వాగతం) (17—9—48)

సీ. అల్లకల్లోలమై - యంధకారంబయి
దారి తెన్నుల్ లేని దారులందు
ఇసుకచల్లినయట్లు - ఈమూలనామూల
మూగు రజాకార్ల మూకతోడ ।
తెలిసియో, తెలియకో, నలుదెసల్ గ్రమ్మెడి
నైజాము స్వీయసైన్యమ్ముతోడ ।
చాటుగామాటుగా, సాయుధులై దూకి
పై బడు, దొంగల బారుతోడ ।
గీ. ప్రాణములనొడ్డి, నైజామురాష్ట్రమందు
శాంతిసంస్థాపనార్థమై జనుచుఁ వడిగ
విజయమునుగొన్న వీరాధివీరులార!
స్వాగతము మీకు నేడు, సుస్వాగతమ్ము ॥

మ. జయమేనాటనొ, నిశ్చయం బెఱుగకే సంగ్రామరంగమ్మునన్
భయశత్రున్ నిజపాదఘట్టనమునన్ మట్టించియున్, మాతృసే
వయె, లక్ష్యంబుగనూని, ప్రాణములనివ్వన్ ధీరులై, పోరి, యాం
ధ్రయశమ్మున్ నిలబెట్టినట్టి, ఘనులారా! మీకివే దీవనల్ ॥

—o—

# స్వాతంత్ర్య వార్షికోత్సవం

(15–8–1948)

సీ. ఎవ్వానియునికి యీ హింసమాతురుష్కులఁ
బొత్తు గల్గించు సమ్మోహనాస్త్ర
మేప్రాజ్ఞు కనుసన్న ఇతర దేశీయుల
ప్రాణార్థములకు శ్రీరామరక్ష
ఏ మహానుభావు నామము ప్రపంచ
శాంతిని స్థాపింపజాలు మంత్ర
మేతండ్రి చేరిక యింటిలో నందరి
ద్రోవకుద్రిప్పు సుగ్రీవునాజ్ఞ
గీ. అట్టి గాంధీమహాత్ముడయ్యయ్యొ! నేడు
లేడు లేడుగదా నేడు కూడి మనల
ఎవనిప్రాపున స్వాతంత్ర్యమిపుడు గల్గె
నట్టి పూజ్యుని స్మరణ కార్యమ్ము మనకు.

గీ. అవుర! స్వాతంత్ర్య వార్షికోత్సవమటంచు
జేరితిమిగాని, తండ్రిని జెనకి పాత
కమ్ము గొన్నట్టి జాతి కిక్కట్లు లేవొ!
యతడు శోకింప, దుఃఖమయమ్ము జగము
అతడు శాంతింప, శాంతిమయమ్ము జగము॥

గీ. ఈమహాపాతక విముక్తికెల్ల యొకటె
త్రోవ, యాతఁడువోయిన త్రోవజనుటె
ప్రథమమున భక్తి నశ్రుతర్పణములిమ్ము
యాతనికి, భరతమాతకు, యనుఁగుతతికి॥

---

## త్రాగుడు పిశాచమా ! యింక, తలిలిపొమ్మ !

(2-10-48)

సీ. మొగలాయి పాదుషాల గులాములుగ జేసి
స్వైర విహారమ్ము సల్పినావు
సంపదోన్మత్త రాజకిరీటముల డించి
త్రివిగా నాటలాడించినావు
ఆంగ్లేయ దేశ మర్యాద, మర్యాద, య
టంచు, మాయించి, పాలించినావు
లాలించి పేదల రక్తమాంసమ్ముల
ద్రావి తాండవ రూపు దాల్చినావు
గీ. ఎంత మాయాస్వరూపిణి, విపుడు దెలిసె
నార! నీ గుట్టు, మా పొలిమేర విడచి
వెడలు, మిటనుండి, యింక, త్రాగుడు
పిశాచమా ! నిశాచర ! పెనుభూతమా ! వెడలుము॥

సీ. పర ప్రభుత్వము క్రిందఁ బడియుండుటన్ జాతి
నిగ్ సాగనంపఁగా నేరదయ్యె
చిర దాస్యమున జిక్కి దెబువమి కన్నులు
నిగ్ రూపు మాపఁగా నేరదయ్యె
పెద్దల మాటల పెడచెవిగ్ బెట్టుటగ్
నీ ద్రోహమెఱుగగా నేరరైరి
దేశ దారిద్ర్య విధిగ్ నీ స్వభావమ్ము
నెంత చెప్పిన, తలకెక్క వయ్యె

గీ. ఇపుడు స్వాతంత్ర్యముఁ గడియించినారు
భరత ఖండాన నిల్వఁగా పాడి కాదు
కదలు మిటనుండి, యాశల వదలుమింక
త్రాగుడు పిశాచమా ! యింక, తఱలిపొమ్మ !

సీ. నన్నాశ్రయించి రేనాఁడొ పేదలటంచు
లేనట్టి జాలి పైబూనకింక
నన్నాశ్రయించి రే నాడధికార వ
ర్గ మటంచు జూపకు గౌరవమ్ము
నన్నాశ్రయించి రేనాఁడొ జమీందారు
లంచు తొల్లిటి యాశలన్ని విడుమ
నన్నాశ్రయించి రేనాఁడొ జీవనముగ
కొలిచిరటంచు లో, కులుక కింక
గీ. పల్లె పల్లెల పట్టణ పట్టణముల
నీదు జంఝాట లవి సాగి, పాడుకొంటి
వకట ! నీకిట నిల్వసాధ్యంబుగాదు
త్రాగుడు పిశాచమా! యింక, తఱలిపొమ్మ ! ॥

సీ. నీయండ చేత నాంగ్లేయులు, నోడల
జేరిరిటకు, తమ సీమనుండి
నీయండ చేత గణించిరి రాజ్యమ్ము
క్రమముగా దేశ సర్వస్వమంత
నీ యండ చేతనే నేర్చిరి పాలింప
భేదతంత్రమ్ముఁ బ్రవేశపెట్టి

నీ యండ చేతనే నిర్మూలనంబాయె
తమ పాలనమ్ము దేశమున తుదకు
గీ॥ యోడలన్ మూటముల్లెలతోడ, నిరుడు
వెడలి రాంగ్లేయులిట, నిన్ను విడచిరకట !
తప్పదాయెను నీకు, యంత్యమ్ము నేడు
త్రాగుడు పిశాచమా? యింక తఱలిపొమ్మ !

ఇదె శ్రీ గాంధిమహాత్మ్మ జన్మసుదినం, బీనాడు, నిన్ సాగనం
పం దలంపుంచె స్వతంత్ర భారత ప్రభుత్వంబింక, నీ స్థానమె
య్యదియో యోచనచేసి, చేరుమిక నీయావాసమున్, నీ వినా
శ దినంబియ్యది, లెమ్ము! త్రాగుడు పిశాచమ్మా! వెసన్ బొమ్మికన్.



# స్వాతంత్ర్య వార్షికోత్సవము

(15—8—48) (గేయము)

ఎన్నాళ్ళకెన్నాళ్ళకు! కడగండ్లు-ఈడేరె, మాతల్లికి,
కన్నులపండువయ్యె, మనభరత – కన్నసంతానమునకు॥
॥ఎన్నాళ్ళ॥

1. చరచరాస్వాతంత్ర్య – ఝంఝానిలమ్ము
పరదాస్యమేఘాల – పారదోలింది
అరమరలేని, ని – ర్మల భరతవీధి
తెలిపిస్మై, స్వాతంత్ర్య – దీప్తివెలిగింది ॥ఎన్నాళ్ళ॥

2. పుట్టుకతో, దయ – పుట్టినయిల్లు
గుట్టుబెట్టుగలట్టి – దిట్టమాయిల్లు
రట్టుచెడి, యిన్నాళ్ళు – పట్టువీడింది
కట్టుదిట్టముచేసి, – కట్టిందికోట ॥ఎన్నాళ్ళ॥

3. పట్టపగ్గములేక – పరవళ్ళుద్రొక్కి-
చుట్టుముట్టి, భేద – సూత్రాలనొక్కి-
కట్టు, పరప్రభుతను – గబగబనెట్టి
పట్టముగట్టిరి – బంగారుతల్లికి ॥ఎన్నాళ్ళ॥

4. రాజ్యమేలపుత్ర – రత్నాలుగలరు
మంత్రమ్ము నడుప, స – మర్థులుగలరు
కొలువసంతతిగలదు – కోటానకోట్లు
కష్టాలుదీరె, నీకన్న – సంతతిచేత॥
ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు – కడగండ్లు – ఈడేరె! మాతల్లికి॥



రాష్ట్రపతి

# జయ్ పట్టాభి !

తెనుగుంబిడ్డకు స్థానమే దొరకదీ దేశాన, ధీమంతుడై
నను, శక్తింగల యట్టివాని కనిఁ శాంతంబూన, నెన్నాళ్లకో
వినవయ్యేన్ మన యాంధ్రపుత్రుఁడు, జగద్విఖ్యాతిగా భారతా
వనికిన్నేతగ, రాష్ట్రమంతట, వరింపంబడ్డ సందేశముఁ॥

సీ. సాధించినావహింసాసూత్రములకు భా
వ్యమ్ముఁ గల్పించి జగమ్మునందు
రాజిల్లినాడవు ప్రాధాన్యమొసగి, స్వ
దేశభాషలకెల్ల దేశములను
ధన్యుడైనావు, స్వతంత్రరాజ్యాధిప
తులకెల్ల, నెల్ల హక్కులనొసంగి
యశము గడించినా వఖిల స్వతంత్రభా
రత నూత్నసౌధనిర్మాణమందు

గీ. విజయమొందితి స్వాతంత్ర్యవీర భార
తావనికి నేతవై నేడు నీవు, పూజ్య
రాజ్యలక్ష్మ్యంబికామనోరమణ ! యసమ
వీర ! పట్టాభిరామ ! దిగ్విజయధామ! ॥

మ. ఫలియించెన్ శ్రమయెల్ల నేటికెపుడీ స్వాతంత్రసంస్థానమం
డలముల్ కూడి, స్వతంత్రభారతములోనన్ జేరునో, నాడెగా
వెలయున్ నిండు, స్వరాజ్యమంచుజని యన్వేషించిసాధించి,యా
వల, నధ్యక్షతకీయగొంటి వనుదున్ పట్టాభి ధీరాగ్రణీ !

శా. పట్టాభీ! యని నీదు తండ్రియగుసుబ్రహ్మణ్యుడేనాడొ, పే
ర్వాటైన్, నీ భవితవ్యమున్ దెలిసియే! లేకున్న నిట్లానొకో!
పట్టాభీ! యని సర్వలోకమనగా బట్టాభిషిక్తుండవై
ట్టెట్టుల్ దప్పును! వీరియూహ్యితము లిట్లీడేరగా నేటికిన్॥

మ. జని సాఫల్యమునొందె నీకిపుడె యీజాతీయకాంగ్రెస్ప్రతి
ష్ఠను గాపాడె గలాడవీవెయని, యాసల్ బూని దేశమ్ము, ని
ల్పినదీ స్థానము నీకెయన్నటుల నిల్పెన్ నేతగా, వీరమం
దున, సాధింపగదయ్యలక్ష్యము, నరేంద్రుల్ దేశజుల్ గూడగా॥

గీ. "నేటికొక స్థానమబ్బెగా నీకతమున
తెనుఁగుబిడ్డకు, భూరి జాతీయసభను
స్థానమేకాదు మకుటమ స్తకముఁ దాంచు
భాగ్యము లభించుగాక, సత్వరమె మాకు॥"

మ. అని నేపల్కిన నాటివాక్యములు, సత్యంబాయె, నీభారతా
వని కధ్యక్షుడవైతివే, జయపురిన్ బట్టాభిషిక్తుండవై
ఘనశోభన్ వెలుగొందునా సమయ మాకాంక్షించెదన్ ధీరవ
ర్తన! పట్టాభిసుధీవరా! విజయసీతారామ వీరాగ్రణీ॥

గీ మత్స్యపురివాడవగుటనా! మత్స్య దేశ
మందు, శివిరాష్ట్రాధిపత్యంపు వీర
మందు పట్టాభిషిక్తుఁడవగుట! దిగ్వి
జయము, నేమూర, పట్టాభి! జయపురాన॥



# పుట్టింట - మర్యాద

స్వాగతము భోగరాజ్ఞ్మణి!
స్వాగత మిదె, భరతరాష్ట్రపతి! భోగములం
దూగుచు, నింటికిఁ జేరితి
స్వాగత మిదె కొమ్మ! నేడు, పట్టాభి! ప్రభూ!

కిలకిల నవ్వుమోము, నునుగేరెడి ఫాలతలమ్ము, మేల్ చలో
క్షుల గురిపించు వక్త్రమును, మాసుకుపోయెడి వజ్రహస్తకౌ
శలము, క్షణమ్మునన్ బరవశమ్మొనరించెడి చూపు, మేఘమం
డలమును జేరు యూహలుగనన్ బహుచిత్రము నీచరిత్రముల్॥

ఉ. ధీరుని, నీస్వరూపమది, దేవునికైన నెఱుంగరాద! నీ
చేరిక, సింగముల్ దరికిచేరు టెఱాయని, భీతిఁజెంద్రదు, గం
భీరమనంబునం దెటు లవెన్న సమృద్ధిగ దాచినావొ నీ
పేరొకతీరు; ధోరణియు వేరుకదా, కన భోగరాజ్ఞ్మణీ॥

ఉ. మచిలీబందరు, పేరుకీర్తులివె సంపాదించె, నూరూర మా
మచిలీబందరువాడవై నిఖిల సన్మానమ్ములం బొందుటన్
సుచరిత్రా! సరి నీల మొక్కటియె సంశోభిల్లుగా నిట్టి నీ
కుచితస్థానము నేటికిన్ దొరికె ♦ విద్యుద్దీప్తమై వెల్గఁగా॥

ఉ. ఒక లోపంబది, యాంధ్రులందుగల దేమో, దేశదేశాలవ్యా
పకమాచున్ నిజ కీర్తిచంద్రికలు పర్వన్నాడెఁబో, యెట్టినా
యకుడైనన్ గొనుగాదె గౌరవము,స్వీయస్థానమందట్లు, తా
వక సన్మానము నేటికిన్ జరిగెఁ బో పట్టాభి ధీరాగ్రణీ!

ఉ. పుట్టుకతో స్వతంత్రుడవు, పూనినవిద్య స్వతంత్రవృత్తియున్
దిట్టతనాన నెట్టితివి, ధీరుడవౌచు స్వతంత్ర దేశసా
మ్రాట్టుగ వచ్చినాడ వసమానము నీదుస్వతంత్రతాశయం
బెట్టుల నుద్ధరించెదవొ ! యీ నినుజేరిన భారతావనిన్॥

ఆ. బ్రహ్మరథముబట్టి, భారతావని యంత
రాజవీధులందు రథముపైని
జయపురాన వెడలు చక్కని నీమూర్తి
సంస్మరింత్రు, రామచంద్రుడనుచు॥

ఆ. నిండుగాక ఖండఖండాంతరమ్ముల
భరతదేశకీర్తి ప్రాభవముగ
ఆంధ్రయశము భారతావని, నీపర్య
వేక్షణమున ప్రాకి వెలయుగాక॥

గీ. ఏరికైనను పుట్టింటివా రొసంగు
నట్టి మర్యాద లెట్టివియైన ప్రియము !
యన్న నుడి మమ్ము గైకొనుమయ్య యే యె
డలను, మరువకు మమ్ము, పట్టాభితండ్రి॥ !



# తెనుఁగుతల్లి

## (గేయం)

మా తెనుఁగుతల్లికి
మా యనుఁగుతల్లికి
చేయెత్తిదండాలు- సేయరే! కూడి ॥మా॥

1. మా గౌతమీయమ్మ - మా కృష్ణవేణమ్మ
మా చిన్నిపెన్నమ్మ - మక్కువ పెంచిన
పంటకళ్ళమ్మ - మాయిల్లు, చూడ
బంగారుమయమె - మాయిల్లు ॥మా తెనుఁగు॥

2. నన్నయ తిక్కన - నాచన సోమన్న
పెద్దన్న పోతన్న - శ్రీనాథుఁ డెఱ్ఱన
తీర్చినయొరవడి - దిద్దుకుంటా - తేనె
జిలిబిలిపలుకులె - చెప్పుకుంటా ॥మా తెనుఁగు॥

3. త్యాగయ్య క్షేత్రయ్య - తలచిన తీయని
రాగాలడోలిక - నూగించుగీతాలె
కమ్మగా నే పాడుకుంటా - హాయిగా
అమ్మయొడిలో - ఊగుతుంటా ॥మా తెనుఁగు॥

4. శ్రీకాకుళాంధ్రయ్య - శ్రీశైలమల్లయ్య
శ్రీకనకదుర్గమ్మ - సింహాద్రియప్పన్న
తిరుపతి వెంకన్న - శ్రీ భద్రాద్రి
రామన్నల - చలువ చలువ ॥మా తెనుఁగు॥

5. శ్రీకాకుళపు మేలి - జిలుగుపుట్టంబులు
ఘంటశాలగట్టి - కదరుపుట్టంబులు
కట్టి మురిసియాడుకుంటా - యింటా
కరువులేదని చాటుకుంటా ॥మా తెనుఁగు॥

6. నాగార్జున విజయ - నగరాల శిల్పాలు
అమరావతీ చల్వ-రాతిలో యందాలు
కనుల పండుగగాదె - చూడు-లోని
కళ చెక్కు-చెదర దీనాడు ॥మా తెనుఁగు॥

7. తిమ్మరుసు యుగంధరుల - దీటులేని ధీశక్తి
పాయని మా కృష్ణదేవ-రాయల సత్కీర్తి
తళతళ వెన్నెలలు గురిసి
తలమున్క-లయ్యె మెరసి ॥మా తెనుఁగు॥

8. మా తాండ్రపాపయ్య - మా బాలచంద్రయ్య
మల్లమ్మ రుద్రమ్మ - మా ఖడ్గతిక్క-న
కత్తిబట్టి కదనుత్రొక్కి - నిల్వ
గజగజలాడె - ముజ్జగము ॥మా తెనుఁగు॥

9. కొండవీటి రెడ్ల - గుండెల బిగువు
గండికోట కమ్మ - పిండుల తెగువు
తలచినంతనె ఝల్లుమనఁగా, ఒళ్లు
తరతరమ్ముల నిల్చి మనుగా ॥మా తెనుఁగు॥

10. వేకుజామున లేచి - వెన్నచిల్కేవేళ
జోకొట్టి పాపల - జోలపాడేవేళ
కదురు ।తిప్పేవేళ యింట - నీపాట
కమ్మగా నే పాడుకుంటా - యింటింట
కమ్మగా నే పాడుకుంటా॥

మా తెనుఁగుతల్లికి ..
మా యనుఁగుతల్లికి -

—— (:) ——



# స మ ర్ప ణ ము

కనులున్ విప్పక, జాగృతిన్ గనక నెక్కాలమ్ము, నజ్ఞానమం
దున నిద్రించిన స్వీయసంతతుల నుద్బోధించి, పల్కించి, చ
య్యన స్వాతంత్ర్యపథమ్మునన్ నడిపి, రాజ్యస్థాపనాశక్తి ని
చ్చిన శ్రీభారతమాతృపాదములకున్ జేమోడ్చి, యర్పించెదన్॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# బృందావన ప్రసూనములు

| | | |
|---|---|---|
| | | రు. అ. పై |
| 1. | వాసుదేవనామ శతకము (ద్వితీయ ముద్రణం) (శ్రీకృష్ణాష్టోత్తర శతనామసంయుతం) | 0 8 0 |
| 2. | ముకుందమాల (ద్వితీయముద్రణం) 60 శ్లోకములు, పద్యములు, తాత్పర్యసహితం | 0 12 0 |
| 3. | బాపూజీ (పద్యములు, గేయములు, జన్మదిన పద్యములు, విశ్వమానవసందేశము, సత్యస్మృతి సహితం) | 0 4 0 |
| 4. | సందర్శనము (ఖండకావ్యం) చక్కని మృదుమధుర శైలిగల పద్యములు | |
| 5. | వాత్సల్యము ,, ,, ,, | |
| 6. | కల్పలత ,, ,, ,, | |

(ఒకే సంపుటము అచ్చగుచున్నది)

ప్రాప్తిస్థానం:—

గురుజాడ రాఘవశర్మ,
సంపాదకుడు.

బృందావన ప్రచురణములు,
మచిలీపట్టణము.